PRSVMO2A149

ప్రస్థానం

సంపుటి : 12 మే 2013 సంచిక : 5

# జీవన సమర భేరి

రావూరి భరద్వాజకు జ్ఞానపీఠ పురస్కారం ప్రకటించడం తెలుగు వారందరూ సంతోషించే విషయం. ప్రగతిశీల వాదులకూ ప్రజాస్వామిక భావాలకూ సదా సన్నిహితంగా మెలిగే రావూరి భరద్వాజ అక్షర శ్రామికుడు. తరాల మధ్య వారధి. సాహిత్య కార్యక్రమాల సారథి. స్నేహశీలి. ఎనిమిది పదుల వయస్సు దాటినా నిరంతర క్రియాశీలంగా కలుపుగోలుగా మసలే సహృదయ సాహిత్య జీవి. ఆయనకు అఖిలభారత స్థాయిలో అత్యున్నత పురస్కారం లభించడం అభినందనీయం. మొదటిది విశ్వనాథ రామాయణ కల్పవృక్షానికి వస్తే రెండవది సి. నారాయణ రెడ్డి విశ్వంభరకు లభించింది. ఇప్పుడు రావూరి భరద్వాజకు ఆ గౌరవం దక్కింది.

నిజానికి చలం, శ్రీశ్రీ, ఆరుద్ర, దాశరథి, కొడవటిగంటి కుటుంబరావు వంటి మహాకవులు, రచయితలెందరో తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. అయితే అప్పట్లో అధినేతల ఆలోచనా ధోరణులు అభ్యుదయాన్ని అస్సలస్సలు సహించేవి కావు. తర్వాతి కాలంలో అనేక భారతీయ భాషల్లో వామపక్ష వాద రచయితలకు ఈ పురస్కారం లభించిందంటే మారిన పరిస్థితులే కారణం. అంతర్జాతీయంగానూ నోబుల్ బహుమానం రాజకీయ కారణాలను బట్టి ఇస్తున్నా సాహిత్య నోబుల్ మాత్రం చాలా వరకు ప్రగతిశీల రచయితలకే లభించడం వారి సాహిత్య సజీవత్వాన్ని పట్టి చూపుతుంది. రావూరి భరద్వాజ ప్రగతిశక్తుల మిత్రుడుగా ప్రజాస్వామిక వాదిగా నిలబడి ఈ గౌరవం పొందడం మరింత ఆనందకారణం.

బొమ్మలు : తుంబలి శివాజీ, వెంకటేష్, భాస్కర్, రమేష్

ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టీసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,

ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

కవిత

# ఆశ

మహ్మద్. ఖాజామైనద్దీన్
9395626276



పెచ్చు లూడిన గోడల యింట్లో అమాయకంగా
అమ్మ నెత్తిమీద సగం పగిలిన సగం విరిగిన
పెంకుల కిరీటం, తునిగిన యిటికలు గోడల్లో
ఇరుక్కుపోయిన్నాయి
గబ్బిలాలు ఆయింట్లోకి పదే పదే వెళుతూ
ఉక్కిరి బిక్కిరై బయటికొస్తున్నాయి
ఆకాశం వెక్కి వెక్కి ఏడ్చినప్పుడల్లా నిరాశ చినుకులు
ముఖాల పెంకుల కన్నాల సమస్యల గుండా
పోటీకై కురుస్తున్నాయి పేదతనంలో-
ఒకడు ఆ పెంకుటింటికి సున్నం వేయాలనుకుంటాడు
ఒకడు డైనమెట్ పెట్టి పేల్చేసి, నూతన భవనం నిర్మిద్దామనుకుంటాడు
ఒకడు విదేశీ పక్షులకు తాకట్టుపెట్టి
అప్పుల చిప్పకై పరిగెత్తాలనుకుంటాడు
ఒకడు సంప్రదాయ సిద్ధాంతాల వేదఘోష
విన్పిస్తూ, ఇల్లంతా తిరుగుతుంటాడు
ఒకడు సిద్ధాంత చింకి చాపల్ని చుట్టుకొచ్చి,
ఇల్లంతా పరచాలనుకుంటాడు
ఒకడు ముసుగు దొంగై పెచ్చులూడిన -
గోడల వెనక దాక్కొని, నక్కి నక్కి చూస్తుంటాడు.
ఒకడు ఇల్లంతా పెత్తనం తనది కావాలనుకుంటాడు
ఇంట్లో శాంతి కూడా తగ్గింది
ఎవని కాడికి వాడు ఇంట్లో దొరికింది
దోచుకుపోతూనే ఉన్నాడు
అడిగే నాథుడే లేడు
అమ్మ మెడ ముత్యాల సరాలతో, వజ్రవైడూర్యాలతో
కాంతులీనుతుండేది గతం నీడల్లో-
నక్షత్రాలు కళ్ళై కళకళలాడేవి
చంద్రుడికి అమ్మ వైభవం చూసి కన్నుకుట్టి
పక్షం రోజులు విపక్షంలో చేరేవాడు
అయినా, ఏనాడూ అమ్మ అనాథగా మారలేదు.
అప్పుడప్పుడు ఆవేదనగా,
సూర్యుడు నాగలి పట్టినా, ప్రేమ బీజాల్నినాటినా,
పైరుకు బదులు, తుపాకులు మొలుస్తున్నాయి.
వాటికి నాటు బాంబులు పూస్తున్నాయి
విధి విచిత్రం బాబూ ! అనేది.
పచ్చటి తోరణాలు కట్టాల్సిన పసిడి చేతులు,
వినాశనానికి చేయి కలుపుతున్నాయి.
చల్లగా మాట్లాడాల్సిన మనసులు
పిల్లిమొగ్గలేస్తున్నాయి.
ఎందుకో? తన కళ్ళను తానే పొడుచుకొని
ఆనందం పడ్డం అలవాటయింది.
అందుకే చెబుతుంది, భవిష్యత్తు ఎప్పటికీ
ధృవతారేనని - ఆటంకాలు, అవరోధాలు చూస్తుంటేనే
వాడి రాలిపోయే పిచ్చిపూలని,
అయినా అమ్మకు ఆత్మవిశ్వాసం తగ్గలేదు,
ఉద్యానవనాలు వెలువకపోవు, పిల్లనగ్రోవి
పాటలు వినిపించకపోవు-
తోకచుక్క కనిపించి కన్నులకు ఆనందం
కలిగించకపోదా అనే 'ఆశ' అమ్మకు.

కథ

# బతుకు యుద్ధం



-డా॥ ఎం. హరికిషన్
9441032212

**బస్సు వేగంగా దూసుకుపోతోంది. రఘురాం కిటికీలోంచి బైటకు చూస్తున్నాడు. చల్లని గాలి ప్రశాంతంగా తాకుతూ వుంది. చీకటిలో రోడ్డుకి ఇరువైపులా ఏమీ కనబడ్డం లేదు. కండక్టర్ టికెట్లు కొట్టడం పూర్తయ్యింది. లైట్లు ఆర్పివేశారు. కాసేపటికే ఎవరో సిగరెట్ అంటించారు. ఒక్కసారిగా భాస్వరం వాసన గుప్పుమంది. రఘురాంకి తలతిప్పినట్లుగా అన్పించింది. ఠక్కున లేచి సిగరెట్టు తాగుతున్న వ్యక్తి దగ్గరకు పోయి "పాడెయ్యి దాన్ని. బస్సులో తాగగూడదని తెలీదా" అన్నాడు కటువుగా. అతను తలెత్తి రఘురాం వంక చూశాడు. ఆరడుగుల ఎత్తుతో, బలిష్టమైన ఒంటితో చీకటిలో మసకమసకగా కనబడుతున్నాడు. మారు మాట్లాడకుండా సిగరెట్ బైట పడేశాడు. రఘురాం తిరిగి తన స్థలానికి చేరుకున్నాడు.**

అమావాస్య దగ్గర పడుతుండడంతో చుట్టూరా చిక్కని చీకటి ఆవరించింది. సమయం పదకొండవుతూ వుంది. హెడ్‌లైట్ల వెలుతురులో మెలికలు తిరుగుతున్న నల్లని రోడ్డు మధ్యలో తెల్లని చారలు వింతగా మెరుస్తూ వున్నాయి. చాలామంది నిద్రలో జోగుతూ వున్నారు. ఎటువంటి అలికిడి లేదు.

అంతలో సడెన్ బ్రేక్ వేయడంతో బస్సు ఒక్క కుదుపుతో ఆగిపోయింది. అందరూ ముందుకి తూలారు. అర్థంగాక అయోమయంగా చూడసాగారు. వెంటనే ఏవో అరుపులు, కేకలు... అద్దాలు భ ళ్ళున పగలసాగాయి. డ్రైవర్ రహదారిపై రాళ్ళు అడ్డంగా వుండడంతో ఏం చేయాలో పాలుపోక వెనక్కి తిప్పడానికి ప్రయత్నించాడు. అంతలోపే కొందరు పగిలిన అద్దాల గుండా కిటికీలలోంచి లోపలికి వచ్చేసి తలుపు తెరిచారు. తెల్లని మాసిపోయిన బనియన్లు, పైకెత్తి కట్టిన పంచలు, ముఖాలకడ్డంగా కట్టిన వల్లెలు వున్న కొందరు కట్టెలు, కత్తులతో లోపలికి దూసుకువచ్చారు. జరుగుతున్నదేమో జనాలకు నెమ్మదిగా అర్థమవుతూ వుంది. అంతలో కొందరు యువకులు "ఎవర్రా మీరు" అంటూ పైకి లేచారు. వెంటనే వాళ్ళు కట్టెలతో దొరికిన వాళ్ళని దొరికినట్టు

దబదబదబ బాదసాగారు. ఒకరిద్దరి తలలు పగిలి ఎర్రని రక్తం బైటపడింది. అది చూడగానే మిగతా వాళ్ళందరి గుండెలు దడదడలాడాయి. భయంతో కొయ్యబారి పోయి వణుకుతూ కుర్చీల్లో అతుక్కుపోయారు. దొంగలు ఆడవాళ్ళ వంటిమీది నగలు, మగవాళ్ళ వాచీలు, వుంగరాలు, గొలుసులు బలవంతంగా గుంజుకోసాగారు. కొందరు సూటుకేసులు పగలగొట్టి విలువైన వస్తువులు బైటికి తీస్తున్నారు. పావుగంటలో పని ముగించుకొని సైగలు చేసుకుంటూ వేగంగా బైటకు పోవడం మొదలుపెట్టారు.

రఘురాం పిడికిలి బిగుసుకుంది. ఒకప్పుడు సైనికునిగా పనిచేసిన ధైర్యం వెన్నుతట్టసాగింది. దొంగలు అంత ప్రొఫెషనల్గా కూడా లేరు. ఒక్కన్ని పట్టుకున్నా చాలు. తీగ లాగితే డొంకంతా కదులుతుంది. ఒక్కుదుటున పైకిలేచి బస్సుదిగుతున్న వాళ్ళ వెంబడి తానూ దుంకి అందరికన్నా చివర పోతున్న ఒకన్ని గట్టిగా వెనుక నుండి వాటేసుకున్నాడు. వాడు విడిపించుకోవడానికి గట్టిగా కేకలు పెడుతుండడంతో ముందు పోతున్న ఇద్దరు వెనక్కి తిరిగి కట్టెల్తో దాడి చేశారు. ఆ దెబ్బలను లెక్కచేయకుండా పట్టినపట్టు విడువకుండా మరింతగా బిగించాడు. బస్సులో తేరుకున్న జనాలు ఒక్కసారిగా బైటకు దుంకారు. వాళ్ళనుచూడగానే దొంగలు వులిక్కిపడ్డారు. ముగ్గురు తప్ప మిగిలినవారు అప్పటికే చీకటిలో కలసిపోయారు. ఒకడు ఆఖరి ప్రయత్నంగా కత్తి తీసి బలంగా రఘురాంను పొడవబోయాడు. రఘురాం నేర్పుగా పక్కకి తిరగడంతో కత్తి దొంగ భుజంలోకి దిగి రక్తం ఎగజిమ్మింది. వాళ్ళు అదిరిపడ్డారు. జనాలు దగ్గర కావడంతో తాము గూడా పట్టుబడతామేమోనన్న భయంతో ఒక్కన్ని అలాగే వదిలేసి పారిపోయారు. వాడు రఘురాం పట్టు నుంచి తప్పించుకోడానికి గింజుకోసాగాడు. ఆ పెనుగులాటలో మొహానికడ్డంగా కట్టుకున్న వల్లె పక్కకి తొలగింది. మసక వెలుతురులో ఆ దొంగ మొహం చూసిన రఘురాం కళ్ళు పెద్దగయ్యాయి. "నువ్వా" అన్నాడు ఆశ్చర్యంతో. దొంగ తలెత్తి రఘురాం వంక చూశాడు. క్షణకాలం ఇద్దరి కళ్ళూ కలిశాయి. చేతిపట్టు సడలింది. వెంటనే ఆ దొంగ ఒక్కుదుటున విదిలించుకొని వేగంగా పారిపోయాడు. రఘురాం షాక్ తిన్నవానిలా అట్లాగే నిలబడిపోయాడు.



రఘురాం వుండేది సికింద్రాబాద్లోని డిఫెన్స్ కాలనీలో. మిలట్రీ నుంచి వచ్చేశాక బ్యాంకులో ఉద్యోగం సంపాదించాడు. నందికొట్కూరులో ఒక పెండ్లి వుంటే బైలుదేరాడు. అంతలో ఈ సంఘటన. పెళ్ళిలో వున్నా రఘురాం చుట్టూ అవే ఆలోచనలు. ఆ రూపం మళ్ళా మళ్ళా గుర్తుకు రాసాగింది. చిన్నప్పుడు ఒకరినొదిలి ఒకరు అస్సలు వుండేటోళ్ళు కాదు. వాని ఆలోచనలతో తల పగిలిపోతోంది. లాభం లేదు... వూరికి పోతే తప్ప విషయం అర్థం కాదు. మళ్ళా ఇప్పట్లో ఇటువైపు వచ్చే పనేం లేదు అనుకున్నాడు. పెళ్ళి పూర్తి కాగానే కర్నూలుకి చేరుకొని డోన్ వైపుకు బైలుదేరాడు. డోన్ పక్కనే చిన్నపల్లె. రోడ్డు మీంచి మూడు కిలోమీటర్ల దూరం. బస్సు దిగి నడక మొదలుపెట్టాడు.

అడుగులు వేస్తూ వుంటే దుమ్ము పైకెగస్తా వుంది. మనుషులు అక్కడక్కడా మాసిన గడ్డాలతో, నల్లబారిన ముఖాల్తో, కరిగిన ఒంటితో కనబడుతున్నారు. పశువుల డొక్కలు లోపలికి పీక్కుపోయాయి. కొంతమంది ఆడవాళ్ళు గుంపుగా ఎక్కడో వూరికి దూరంగా వున్న సుంకులమ్మ చెరువు నుండి నెత్తిన ఒక బిందె, సంకలో ఒక బిందె పెట్టుకొని వేగంగా అడుగులు వేస్తున్నారు. పొలాలు నిర్మానుష్యంగా వున్నాయి. ఎండకు ఒళ్ళు చెమటలు కక్కుతూ వుంది. గసబెడతా వూళ్ళోకి ప్రవేశించాడు. రోడ్లమీద ఆడాడ పిల్లలు చెట్ల నీడన ఆడుకుంటున్నారు. పనుల కోసం వలసలు పోవడంతో చాలా ఇండ్లకు తాళాలేసి వున్నాయి. ముసిలోళ్ళు, పిల్లలు తప్ప యువకుల జాడ చాలా తక్కువగా కనబడుతూ వుంది.

చిన్నప్పుడు ఆడుకున్న వీధులు, చదివిన బడి, తిరిగిన ప్రదేశాలు అన్నీ నిశ్శబ్దంగా పలకరిస్తున్నాయి. చెల్లెళ్ళ పెండ్లిళ్ళు, నాన్న చనిపోవడం, గుత్తలు పెద్దగా రాకపోవడంతో వచ్చిన కాడికి భూములమ్మేసి అమ్మను తనతో తీసుకుపోవడం, వూరితో పది సంవత్సరాలుగా సంబంధాలు పూర్తిగా తెగిపోవడం... ఒకొక్కటే గుర్తుకు రాసాగాయి. నెమ్మదిగా అడుగులు వేస్తూ రామాలయం పక్క సందులోకి తిరిగాడు. చిన్ననాటి మిత్రుడు సుంకన్న ఇల్లు కనబడింది. తలుపు తెరిచే వుంది. "హమ్మయ్య... ఇంట్లో ఎవరో ఒకరు వున్నట్టున్నార్లే" అనుకుంటూ దగ్గరికిపోయాడు.

ఇంటి పక్కనే వున్న వేపచెట్టు కింద నులకమంచమేసుకోని వుత్తపైన పడుకోనున్న సుంకన్న అలికిడికి లేచి కూర్చున్నాడు. రఘురాంని గుర్తుబట్టి ఆశ్చర్యంతో, ఆనందంతో "రేయ్...బాగున్నావా... ఏమిట్రా దారి తప్పొచ్చినావు. ఐనా ఇంత ఎండనబడి రాకపోతేనేం చల్లగైనాక రాగూడదా" అంటూ ఆప్యాయంగా పలకరిస్తూ లేచి దగ్గరకొచ్చాడు.

"ఏం లేదురా... స్నేహితుని కూతురి పెండ్లుంటే నందికొట్కూరుకి వచ్చింటి. ఎట్లాగూ ఇంత దూరం వచ్చాగదా... ఒకసారి అందరినీ పలకరిచ్చి పోదామని" అన్నాడు.

"దా...దా..." అంటూ లోపలికి పిలుస్తూ "ఏమే... ఎవరొచ్చినారో చూడు" అంటూ గట్టిగా కేకేసినాడు. సుంకన్న పెండ్లాం బైటకొచ్చి "ఏంనా... బాగుండావా... పూర్తిగా నల్లపూసైనావ్. వదినా, పిల్లలు ఎట్లుండారు. చూసి ఎన్నేళ్ళయిందో... అంతా పెద్దోళ్ళయి పోయింటారే" అంటూ

పలకరిస్తూ కాళ్ళు కడుక్కోమని చెప్పింది. రఘురాం జలాట్లోకి పోయి గచ్చులో అడుగునున్న నీటిలో చెంబుతో ముంచుకోని కాళ్ళూ చేతులు కడుక్కున్నాడు. "దా... బైట్నే కూచుందాం. ఇంట్లో ఒకటే ఉక్క" అని సుంకన్న పిలిస్తే తలుపుతూ చెట్టు కింది నులకమంచి మీదకు చేరుకున్నారు.

"ఏరా... పంటలెట్లావున్నాయి. ఏమేసినావీసారి" ప్రశ్నించాడు రఘురాం.

సుంకన్న ఆకాశమొంక చూసి నిట్టూరుస్తా "అవ్వ వడికిన నూలు తాత మొలతాటికి సరన్నట్లు పెట్టింది రావడమే గగనమైపోతోంది. ఈ యవసాయం చేసే దాని కన్నా కూలిపనికి పోవడమే మేలురా... ఎండలు సూసినావు గదా... ఈ సమ్మచ్చరం మరీ ఎక్కువైపోయినాయి. దుడ్లు మన్నులో పోసినట్లే. ఏమీ సేయలేక కిందాపైనా మూసుకోని గమ్మున ఆకాశమొంక సూస్తా కూచున్నాం" అన్నాడు.

అంతలో అటువైపు పోతున్న క్రిష్ణారెడ్డి రఘురాంని చూసి "ఏమన్నా... ఎప్పుడొచ్చినావు" అంటూ పలకరిస్తూ మంచమ్మీదకు చేరుకుని రఘురాంని ఎగాదిగా చూస్తూ "అనా... నేను గూడా ఇంటరైపోగానే నీ యెంబడే మిలట్రీలో చేరింటే బాగుండేదనా" అన్నాడు.



"నీకేంలే కృష్ణారెడ్డి! రోజుకో కాంట్రాక్టు. పూటకో అగ్రిమెంటు. దుడ్లు దులిపిన కొద్దీ రాల్తున్నాయ్. ఇంగెందుకో ఆ వుత్తుత్త ఏడుపు" అన్నాడు సుంకన్న.

"సాల్లేరోయ్... దొరికినాడు గదాని బలే సంబడంగ ఎగిరెగిరి చెబ్తున్నావ్. దా.. ఓ కాంట్రాక్టిప్పిస్తా. కూలోల్తో పనులేపిచ్చి, పెద్దరెడ్డికి పర్సెంటేజిచ్చి, ఇంజనీర్లను మేపి, బిల్లులు సాంక్షను చేపిచ్చుకునేసరికి తలలో జేజెమ్మ దిగొస్తాది. కూచోని మాటలు చెప్పడం గాదు కాంట్రాక్టులంటే".

కృష్ణారెడ్డి కాసేపు మాట్లాడి వెళ్ళిపోయినాడు. వాడట్లా పోగానే "మాటలు నేర్చినాడు కొడుకు. రెడ్డి రాజకీయం వుపయోగించి వూళ్ళో కాంట్రాక్టులన్నీ కొట్టెస్తా వున్నాడు. దానికి తోడు పనికి ఆహార పథకం లడ్డులెక్క దొరికింది. ఈ కరువుల్లో గూడా పచ్చగుండేది ఇట్లాంటి నాకొడుకులే. స్నేహితులైనా, బంధువులైనా ఎంతవసరమొచ్చినా ప్రామిసరీ నోటు మీద సుతకం లేకుండా ముడ్డి కింద నుంచి మూట తీయడు. వడ్డీల మీద వడ్డీలేస్తా వుంటే తట్టుకోలేక ఆఖరికి భూములు అమ్ముకోవాల్సిందే... పాపం... శంకరప్ప లేడూ... బోయగేరిలో వుంటాడు. అప్పు కట్టలేక, అవమానం తట్టుకోలేక ఆఖరికి పొలంలోనే చింతచెట్టుకి వురేసుకునె. ఇంకా ఎంతమంది వుసురు పోసుకోవాల్నో వీడు" అన్నాడు.

రఘురాం మనసంతా అదోలా అయిపోయింది. కాసేపు మౌనంగా వుండిపోయాడు. మళ్ళా పదే పదే బస్సు సంఘటన గుర్తుకు రాసాగింది. విషయం చెప్పకుండా కాసేపు అవీ ఇవీ మాట్లాడి "అవునూ బలిజగేరిలో గోవిందయ్యని చిన్నప్పుడు మనతోబాటు చదువుకున్నాడే... వాడెట్లా వున్నాడు. చూడక చానా రోజులైంది" అన్నాడు. ఆరా తీస్తూ..

సుంకన్న ఓ నిమిషం పాటు ఆగి "ఇంగెక్కడి గోవిందయ్య. మూడు సమ్మచ్చరాలైపాయ వూరిడిచి. ఇంతవరకూ ఇటువైపు గూడా తొక్కి చూళ్ళా" అన్నాడు.

"ఏం... ఏమైంది" ఆతృతగా అడిగాడు.

"నువ్వు వూరిడ్చిన మూడు సమ్మచ్చరాలనుకుంటా... కరువొచ్చి వరసగా రెండు సమచ్చరాలు దెబ్బ మీద దెబ్బ కొట్టె. పదెకరాలంటే మన సీమలో ఏమీ లేనోడనే గదా అర్థం. అప్పట్లో కూతురి పెండ్లుందని మరో పదెకరాలు ముందస్తు గుత్త ఇచ్చి తీసుకునె. అప్పులు చేసి విత్తనాలు, ఎరువులు తెచ్చ. వాన మొదట్లో బాగానే కురిసినా అవసరమైనప్పుడు మొగం చాటేశ. కండ్ల ముందు పంట వాడిపోతుంటే చూళ్ళేక అప్పుపెట్టి బోరేపించ. సన్నపిల్లోడు పుచ్చ పోసినట్టు నీళ్ళు పడె. అదీ మూన్నాళ్ళ ముచ్చటే. అప్పులు తీర్చలేక నల్లవంక కాడున్న ఐదెకరాలు అమ్మేశ. మిగిలిందాంతో పిల్ల పెండ్లి చేశ. అంతలో వూరి బైట ఒక ఫ్యాక్టరీ వచ్చ. వీనికి రోడ్డు మీద ఐదెకరాలుందిగా... అదింత దాండ్లోకి పాయ. అమ్మనని వీన్తోబాటు చానామంది అడ్డం తిరిగినారు గానీ ఎమ్మెల్యే మధ్యలో దూరినాడు. ఎదిరిచ్చి ఎట్లా బతగ్గలం. దాంతో ఇచ్చిన కాడికి పుచ్చుకొని చెప్పినచోట వేలిముద్రేసి కిమ్మనకుండా బైటకొచ్చ. దుడ్లు బాగానే వచ్చినాయి గానీ అవెంతకాలం నిలబడ్తాయి. వూరిబైట భూములన్నీ ఫ్యాక్టరీలోకి పోగానే వూర్లో భూములన్నీ కొండెక్కి కూచున్నాయి.

వానికున్నది ఒక్కడే కొడుకు. ఒక్కసారిగా దబ్బొచ్చిపడేసరికి యాపారం చేద్దామని పట్టుబట్టె. మొదట్లో బాగానే జరిగింది. దుడ్లు దుడ్లు గాదు. కానీ చుట్టూరా స్నేహితులు, జల్సాలు. కొడుకు ఎవరి మాటా వినేటోడు గాదు. ఖర్చు ఖర్చుగాదు. ఒకసారి మందు తాగి రోడ్డు మీద బైకులో రయ్యిమని రాత్రిపూట వస్తా వంటే... పెద్దబావి కాడ మలుపుంది చూడు.. ఆడ చూసుకోక ఎదురుగొస్తున్న ఎద్లబండికి కొట్టేశాడు. నెలరోజులు అస్పత్రిలో దబ్బు మంచినీళ్ళ లెక్క ఖర్చాయ. ఆఖరికి ఒంటికాలుతో కొడుకింటికి చేరుకునె. పరిస్థితి మళ్ళా మొదటికొచ్చ. భూమిలేనోనికి ఎవడప్పిస్తాడు. పుట్టినూళ్ళో గంజినీళ్ళు గూడా పుట్టలా... పూలమ్మిన చోట కట్టెలమ్మలేక ఆఖరికి తట్టాబుట్టా తీసుకొని పెండ్లాం పిల్లల్తో టౌనుకి ఎల్లిపాయ. అంతే... ఆరోజు నుంచీ వాని మొగం మళ్ళా ఎవరమూ ఎప్పుడూ చూళ్ళా" అన్నాడు.

రఘురాంకి నెమ్మదిగా విషయమంతా అర్థం కాసాగింది. మాటల్లోనే సుంకన్న పెండ్లాం ఇద్దరికీ కాఫీ తెచ్చిచ్చింది. కాఫీ తాగుతూ వుంటే ఓ జీపొచ్చి ఇంటి ముందాగింది. సుంకన్న పెద్ద కొడుకు వీరేష్ అందులోంచి దిగ్గానే దుమ్ములేపుకుంటూ

కవిత

# సగటు జీవి

ఓరుగంటి పురుషోత్తం
9703336584

ఉన్న వాళ్ళలో జమా లేను
లేని వాళ్ళ లెక్కలో లేను
ఆకాశమంత ఎత్తు ఎదగలేను
అధఃపాతాళానికి దిగజారలేను
ఆశయాలకు అంత్యక్రియలు జరిపి
అనుబంధాలకు బంధీనయ్యాను
ఆశ కోసం నేనడుగు లేస్తుంటే
నిరాశ నా నీడన చేరాలని
పొంచి పొంచి వుంటుంటది
ఊహల్లో చిక్కుకున్న గూడును
భూమార్గం పట్టించలేను
వంటింట్లో పొయ్యిలో దూరాలని
మాటేసిన పిల్లిని తరిమెయ్యలేను
కడుపులో సగం ఆకలిని



చంపెయ్యలేను
నా గొఱ్ఱితోక ఆదాయం
ఉన్న దాంట్లోనే ముడుచుకొమ్మని
హెచ్చరిస్తుంటది
ఎప్పుడైనా అప్పులేనా ఆస్తి
ఎన్నడైనా అనుభవంతోనే దోస్తి
సౌకర్యం నా బ్రతుకున ఎండమావి
నాకున్న కోర్కెలు
రెక్కలొచ్చినా ఎగురలేని పక్షులు
జీవిత సమరంలో అనుక్షణం గాయపడుతున్న సైనికున్ని
కష్టానికి సుఖానికి మధ్యన
చావలేక బ్రతుకుతున్న
బ్రతకటానికే చస్తున్న

---



పోయింది. ఫుల్లుగా తాగినట్టున్నాడు. ముఖం వుబ్బి కండ్లు ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి. తలొంచుకొని తడబడుతూ చక్కగా ఇంట్లోకి పోయినాడు.

రఘురాం వాన్ని చూస్తూ "పెద్దోడు గదా... ఏం చేస్తున్నాడిప్పుడు" అన్నాడు ఆశ్చర్యంతో. సుంకన్న కాసేపు మౌనంగా వుండి "రాజారెడ్డి దగ్గర పన్జేస్తున్నాడు" అన్నాడు గొణుగుతున్నట్లుగా.

రాజారెడ్డి గురించి రఘురాంకి బాగా తెలుసు. వూళ్ళో ఒక వర్గానికి ఆయన మాటే వేదం. తిరుగులేదు. ఎప్పుడూ ఓ పదిమంది కత్తుల్తో, నాటుకట్టెల్తో ఎంబడుండాల. పెద్దరెడ్డికి రాజారెడ్డికి అస్సలు పడదు. ఎవరి మీద ఎవరు దాడి చేస్తారో తెలీదు. నిరంతరం గొడవలూ, కేసులే. మధ్యలో ఎంతమంది ప్రాణాలు పోయామో తెలీదు.

"తెలిసి...తెలిసీ.. ఆయన దగ్గరెందుకు పెట్టావ్" అన్నాడు రఘురాం.

సుంకన్న విరక్తిగా నవ్వి 'ఏం చేద్దాం... నాలుగువేళ్ళు నోట్లోకి పోవాలంటే ఏదో ఒగటి సెయ్యాల... తప్పని తెలిసినా తప్పదు. సూస్తూ సూస్తూ పస్తులతో సావలేం గదా... వీడు తెచ్చి పెడ్తుండబట్టే ఇంట్లో జరుగుతా వుంది" అన్నాడు.

మాటల్లోనే సాయంకాలమైంది. రఘురాం పోయొస్తానని చెప్పి బైలుదేరాడు. అంతలో సుంకన్న "మన గోవిందయ్య వుండేది టౌనులోనే గదా... కర్నూల్లో ఎవరైనా తెలిసినోళ్ళుంటే కాస్త వెదికి చూడు. దొరుకుతాడు" అన్నాడు.

రఘురాంకి జరిగింది చెబుదామని నోటిదాకా వచ్చింది. కానీ తమాయించుకున్నాడు. పోయొస్తానని అందరికీ చెప్పి బైలుదేరాడు.

కర్నూలు నుండి లోకల్ రైలు వచ్చినట్లుంది. ఉదయం పనుల కోసం నగరానికి పోయిన జనాలంతా తిరిగివస్తూ వున్నారు. చీకట్లో ఎవరూ గమనించడం లేదు. ఎవరి తొందరలో వాళ్ళు... అలసిన ముఖాల్తో, చెమట పట్టి మట్టికొట్టుకున్న బట్టల్తో, పలుగు పారల్తో, ఖాళీయైన సద్ది మూటల్తో పెద్ద పెద్ద అడుగులు వేస్తూ వేగంగా ఇండ్ల వైపు వెళుతున్నారు.

పల్లెలన్నీ ప్లాట్లుగా, సెజ్జులుగా మారిపోయాక గ్రామాల్లోని సాలు సక్కగ వచ్చేటట్లు గొర్రు పట్టి విత్తనమేసే మొనగాళ్ళు, వంచిన నడుం ఎత్తకుండా చకచకచక నాట్లు వేసే పనిగత్తెలు, కొడవలి పడితే చాలు ఒక్కరోజే ఎకరాలకు ఎకరాలు పంట కోసే పాలెగాళ్ళు, గడ్డివాముల్ని ఎంతటి గాలికైనా, వానకైనా చెక్కు చెదరకుండా నిర్మించే నేర్పరిగాళ్ళు... ఈ వ్యవసాయ నిపుణులంతా... నగరాల్లో భవన నిర్మాణాల్లో అన్‌స్కిల్డ్ లేబర్‌గా మారిపోయారు. ఒకప్పటి రాష్ట్ర రాజధానిని తలచుకుంటే మనసు కళుక్కుమంది. నగరంలో ఫ్యాక్టరీల సైరన్‌మోత వినక ఎన్నాళ్ళయిందో. పేపరుమిల్లూ, కార్బైడ్ ఫ్యాక్టరీ, బిర్లా, ఎంజీ బ్రదర్స్ ఒక్కటనేటి అన్నీ ప్లాట్లుగా, అపార్ట్‌మెంట్లుగా మారిపోతున్నాయి. కార్మికులూ లేరు. కర్షకులూ లేరు.

మనసంతా వూరి గురించిన ఆలోచనలే. గుండె బరువెక్కి పోతోంది.

"మంచీ చెడూ, నీతి న్యాయం, ధర్మం అధర్మం... ఇట్లాంటివన్నీ కడుపు నిండినోళ్ళ ఆలోచనలే... కానీ బతకడమే యుద్ధమైన చోట..."

రఘురాంకి గోవిందయ్య, సుంకన్న, శంకరప్ప... అందరూ చుట్టూ మూగి ప్రశ్నిస్తున్నట్లుగా వుంది.

ఆఆ

## కవిత

# ఎవరిపై దాడి చెయ్యాలి ???

కోటి విజయభాను



వారి జీవితం మరణం కన్నా దుర్భరం ఐపోయింది
గాలి విషపూరితమైపోయింది
ప్రతి శ్వాసతోనూ కొంచెం కొంచెం చావు వారి ఊపిరితిత్తుల్లో
వారి ప్రపంచం అంధకారమయం అయింది
ఆకాశంలో ఎక్కడో, సూర్యుడు అలసిపోయి నిద్రపోయాడు
తాతలు చెప్పిన కథల్లో వెలుతురు గురించి విన్నారు వారు
స్వాతంత్ర్యం గురించి కూడా విని ఉన్నారు
స్వప్నాల గురించి కూడా విన్నారు
పేర్లు విన్నారంతే! కథలు విన్నారంతే !
అవి నిజమో, కాదో కూడా తెలీదు
వారికి భగవంతునిపై గొప్ప విశ్వాసం ఉంది
ఎందుకంటే, తమకు తాముగా వారు ఏదీ చేసేవారు కాదు,
చెయ్యగల సామర్థ్యం కూడా లేదు
వారి ప్రతి సఫలతకు, అసఫలతకు బాధ్యుడు భగవంతుడే!

ఒకరోజు వారు తమ దురదృష్టం, భయం మరియు నిరాశలః
ఎవరో వారికి క్రాంతి గురించి చెప్పారు
మొదట్లో వారికి ఇది విచిత్రంగా తోచింది
కానీ పిల్లలు ఉసిగొల్పాక, కొందరు నిలబడ్డారు
తమ శిరస్సులపై కఫన్ కట్టుకున్నారు
శత్రువులను పరాజితులను చెయ్యడానికి బయలుదేరారు

శత్రువులను వెతుకుతూ వెతుకుతూ వారు
నదులు, సముద్రాలు, పర్వతాలు, ఎడారులు.. అన్నీ దాటారు
అప్పుడప్పుడూ వారు గాల్లో ఖడ్గాలను తిప్పేవారు, అప్పుడప్పుడూ బండరాళ్ళపై కూడా
ఒక్కోసారి సముద్రపు అలలను ముక్కలు చేయడానికి ప్రయత్నించేవారు
అలసట అన్న మాటలేక అలా సాగిపోతూనే ఉండేవారు
గొంతు పెద్దది చేసి, "ఇంక్విలాబ్" అంటూ నినాదాలను చేసేవారు
వారి భగవంతుడు, వారి స్థితిని చూసి ఆశ్చర్యపోయాడు

గొప్ప క్రోధంతోనూ, ఆక్రోశంతోనూ, పగతీర్చుకోవాలనే భావనతోనూ
వారికి ఒక గుహ గురించి తెలిసింది
ఆ లోతైన గుహలోకి ప్రవేశించారు వారు
ఈ గుహ బయటి ప్రపంచం కన్నా ఎక్కువ అంధకారంగా ఉంది
బయటి ప్రపంచం కన్నా భయనకంగా ఉంది
వారు తమ కరవాలలను ఆడిస్తూ లోపలికి పోయారు
గుహలో ఎవరూ లేరు... నిశబ్ధం, అంధకారం తప్ప!
వారు "ఇంక్విలాబ్" అని నినాదాలు చేస్తూ ముందుకు నడుచుకుపోయారు

ఈ గుహలోనే వారి శత్రువులు ఉన్నారని వారు విని ఉన్నారు
ఆ శత్రువే తమ సూర్యుడినీ, తమ స్వప్నాలనూ
తమ ఆశలనూ, తమ స్వాతంత్ర్యాన్నీ
ఖైదు చేసి ఉంచాడని విని ఉన్నారు

ఇక్కడి వరకూ చేరేలోపు చాలా మంది మరణించారు
ఆకలితో, దాహంతో, నిరాశతో, భయంతో!
బ్రతుకున్న వారు ఒక చేయి ఒకరు పట్టుకుని ముందుకు నడిచారు
వారు తిరిగి వెనక్కి వచ్చేసేవారే !
కానీ వారికి తెలుసు... ఇంత దూరం వచ్చాక వారు తిరిగి ఇంటికి చేరలేరని !

నిస్సత్తువ ఆవహించిన, నీరసించిన పాదాలను ముందుకు నెడుత
నడుస్తూ... నడుస్తూ... వారు యుగాలు దాటినట్లైంది
ఎంత దూరం నడిచినా, ఎవరూ అగుపించలేదు
వారి మనసుల నిండా....
వదిలి వచ్చిన తమ దేశం,
తమ కుటుంబాల జ్ఞాపకాలే ఉన్నాయి
ఈ నిరాశ, క్షోభ... తమ తోటి క్రాంతికారుల మరణాలు
వారి కోపాన్ని ఇంకా పెంచాయి
వారి కళ్ళు చింతనిప్పుల్లా మండుతున్నాయి
ఇప్పుడు వారికి భయం లేదు
ఇప్పుడు కోల్పోవడానికి ఏముందని ?



అప్పుడే....
ఎదురుగా...
ఏదో వెలుగు కనిపించింది
వారికి అర్థమైపోయింది... గుహ ఇక అంతమైపోతోందని
అంటే?
శత్రువు ఇపుడు సమీపంలో ఉన్నట్లే కదా !
తమ ఆయుధాలను పట్టుకుని, వారు విద్యుత్ వేగంతో పరుగెత్తా
వారి పాదరక్షల నుండి నిప్పులు పుట్టాయి
గుహ అంతా వారి పాదతాళాలతో దద్దరిల్లిపోయింది
మళ్ళీ "ఇంక్విలాబ్" నినాదాలు హోరెత్తాయి... భూమి కంపించిం

కాని, ఎప్పుడైతే వారు గుహ చివరి భాగాన్ని చేరారో..
వారి కాళ్ళ క్రింది భూమి లాగేసినట్లైంది
గుహ చివర అద్దాలు బిగించబడి ఉన్నాయి
ఆ అద్దాల్లో వారి ప్రతిబింబాలే ప్రతిఫలిస్తున్నాయి
వారికేం చెయ్యాలో అర్థం కాలేదు.
ఎవరిని మట్టుపెట్టాలని ఇంత దూరం ప్రయాణం చేసి వచ్చారో...
ఆ శత్రువులు ఎదుటే ఉన్నారు!
ఎవరిని అంతమొందించడానికి
తమ దేశాన్ని, కుటుంబాల్ని కోల్పోయారో
ఎంతో మంది సహచరుల్ని మార్గమధ్యలో పోగొట్టుకున్నారో !
ఇంత నష్టపోయాక, ఖాళీ చేతులతో వెనక్కి తిరిగి వెళ్ళడమెలా?
కానీ...
వారు మీ మాంసలో పడిపోయారు...
ఎవరిపైదాడి చెయ్యాలి?
అద్దాలపైనా?
తమపై తామా?
నిర్ణయం సులువైపోయింది
వారు అద్దాలను పగులగొట్టారు
శత్రువుల మరణాన్ని సంబరంగా జరుపుకుంటూ వెనక్కి వచ్చారు !!!

**(ప్రముఖ కార్టూనిస్ట్, ఇండియా అగెనెస్ట్ కరప్షన్ కార్యకర్త, అసీమ్ త్రివేది హిందీ కవితకు అనువాదం)**

# 'రాక్షస' శబ్ద సృష్టి రావణ, ఇంద్రజిత్తు వధ ప్రత్యామ్నాయ చారిత్రక దృక్పథం

డా॥ కత్తి పద్మారావు
9849741695

రామాయణ, భారతాల సృష్టి కూడా చరిత్రను వక్రీకరించడానికే. ఆర్య రాజుల గొప్ప తనాన్ని కీర్తించి దళిత రాజుల్ని, దళితుల్ని అవమానపరిచారు. దళితులను శపించడం, వాళ్ళని రాక్షసులని పేర్కొనడం, వాళ్ళు వధించటానికి అర్హులని నమ్మబలకడం ఒక పనిగా వాళ్లు చేశారు. రావణుడికి ఎన్ని సుగుణాలున్నా, అతను విష్ణువు చేత శపించబడ్డాడు కాబట్టి వధకు అర్హుడే అని నిర్ధారించారు. రావణుని వధ తరువాత జరిగిన సభాస్థలిని వర్ణిస్తూ ఉత్తరాకాండలో వాల్మీకి ఇలా అన్నాడు.

మూ. **ప్రాప్తరాజ్యస్య రామస్య రాక్షసానాం వధే కృతే,**
**అజగ్ముర్మునయః సర్వే రాఘవం ప్రతినన్దితుమ్.**
**ప్రథమ సర్గ 1 శ్లో.**
**కౌశిక్కోథ యవక్రీతో గార్గ్యో గాలవ ఏవ చ,**
**కణ్వో మేధాతిథేః పుత్రః పూర్వస్యాం దిశియే శ్రితాః**
**ప్రథమ సర్గ 2 శ్లో.**

తా. రాక్షసులను సంహరించిన పిమ్మట రాముడు రాజ్యమును పొందాడు. అతనిని అభినందిచటానికి మునులందరూ వచ్చారు. తూర్పుదిక్కులో ఉన్న కౌశికుడు, యువక్రీతుడు, గార్గ్యుడు. కాలవుడు, మేధాతిథి పుత్రుడైన కణ్వుడు ఆ ప్రాంతం నుండి వచ్చారు. (ఉత్తరకాండము: మొదటి సంపుటము; పేజీ.నెం. 1, ; ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామ చంద్రుడు గారు రచించిన బాలనందినీ వ్యాఖ్యతో కూడినది; ఆర్షవిజ్ఞాన ట్రస్టు, హైదరాబాదు -1994)

ఈ సభకు ఇంకా దక్షిణ దిక్కునుంచి ఆత్రేయుడు, సముచి, ప్రముచి, అగస్త్యుడు, అత్రి, సుముఖుడు, విముఖుడు, పశ్చిమ దిక్కునుంచి నృషంగుడు, కవషి, ధౌమ్యుడు, కౌషేయుడు వచ్చారు.

మూ. **"వసిష్టః కశ్యపో-ధాత్రిర్విశ్వామిత్రః సగౌతమః,**
**జమదగ్నిర్భరద్వాజస్తే-పి సప్తర్షయస్తథా,**
**ప్రథమ సర్గ 5 శ్లో.**
**ఉదీచ్యాం దిశి సప్తైతే నిత్యమేవ నివాసనః**
**ప్రథమ సర్గ 6 శ్లో.**

తా. ఉత్తర దిక్కులో ఉండే వసిస్టుడు, కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదాగిన భద్వాజుడు అను ఏడుగురు ఋషుల కూడా అక్కడకు వచ్చారు. (అదే పుస్తకం పేజీ: 3)

**బ్రాహ్మణ రుషివర్గం - అయోధ్య కేంద్రం**

ఆ రోజుల్లో బ్రాహ్మణ ఋషి వర్గానికి. అయోధ్య కేంద్రంగా ఉండేది. బ్రాహ్మణ ప్రముఖులందరూ వచ్చి రావణుని చంపినందుకు రాముణ్ణి అభినందించారు. రావణునితో పాటు యజ్ఞకోపుడు, ధూమ్రాక్షుడు వంటి యుద్ధవీరులంతా రాక్షసుల్లో ఉన్నారని, వారిని కుతంత్రాలతో చంపడం గొప్ప విషయమని ఋషులు కొనియాడారు. యుద్ధమంటే కుతంత్రమని, కుతంత్రం లేకుండా మూలవాసులను జయించలేమని వారు దేశీయులన్న విషయం మర్చిపోవద్దని, ఇంద్రజిత్తు లాంటి వాడిని చంపడం దుర్భేజ్యం వంటి విషయమని వారు చెప్తూ వచ్చారు.

**దేశీయ రాజులపై కుతంత్ర యుద్ధాలు-ఇంద్రజిత్తు హత్య**

దేశీయ ప్రజలైన మూలవాసులు దేశీయ యుద్ధ వీరులు నిజాయితీగా పోరాడతారని, అదే వారి బలహీనతని ఆర్య ఋషులు వ్యాఖ్యానించారు. ఇంద్రజిత్తుని చంపడం అంటే రఘువంశాన్ని నిలబెట్టడం అని చెప్తూ

మూ. **"అభినన్దామ తే సర్వే సంశ్రుత్యేన్ద్రజితో వధమ్,**
**అవధ్యః సర్వభూతానాం మహామాయాధరో యుధి,**
**విస్మయస్త్వేష చాస్మాకం తం శ్రుత్వేన్ద్రజితం హతం**
**ప్రథమ సర్గ 30 శ్లో.**

నీవు ఇంద్రజిత్తును చంపిన వార్తవిని మేమందరం అభినందిస్తున్నాం. యుద్ధములో అతనిని ఎవ్వరూ కూడ చంపజాలరు. అందుచేత అతడు సంహరింపబడినట్లు విని మాకు చాలా ఆశ్చర్యము కలిగింది అంటున్నారు ఆర్య ఋషులు. (అదే పుస్తకం పేజీ. నెం. 11)

ఇంద్రజిత్ అంటే ఇంద్రుణ్ణి జయించినవాడు ఇంద్రుణ్ణి జయించినవాణ్ణి చంపావు కాబట్టి ఇక ఆర్య రాజులకు, నీవే నాయకుడవు, ఆర్య ఋషులకు నీవేరక్షకుడవు అని ఋషులంతా కొనియాడారు. రామాయణ రచనా కాలం మీద ఎన్నో వివాదాలు వున్నా రామాయణం బుద్ధునికి ముందు రాసివుండవచ్చునని చరిత్రకారుల అభిప్రాయం.

ఆర్యులు చాలా వ్యూహాత్మకంగా దేశీయ రాజుల మీద యుద్ధం చేశారనడానికి ఈ సమావేశం మనకు ఉదాహరణ.

నిజానికి రామాయణంలో ఎన్నో అభూత కల్పనలున్నా, ఇది

ఆర్య రాజ్య విస్తరణకు సంబంధించిన కథ అని స్పష్టం అవుతుంది. ఈ కథనం నిజమైన చరిత్ర కంటే భారతీయుల బుర్రల్లో బాగా ఎక్కింది. దాని ద్వారా దేశీయ ప్రజలను రాక్షసులని, స్త్రీలోలురని, వారిని వధించటంలో తప్పులేదని నమ్మారు.

నిజానికి 'రాక్షస' శబ్దాన్ని వ్యతిరేకార్థంలో వాడారు. ఇప్పటికి చెడు చేసిన వాణ్ణి 'రాక్షసుడు' అని సంబోధిస్తున్నారు.

'ఇంద్రజిత్ తండ్రికంటే కూడా గొప్ప వీరుడెలా అయ్యాడు, ఇంద్రుణ్ణి ఎలా జయించాడు చెప్పమ'ని రాముడే అగస్త్యుణ్ణి ఇలా అడుగుతాడు.

మూ. **శక్రోపి విజితస్తేన కథం లబ్ధవరశ్చ సః**
**కథం చ బలవాన్పుత్రో న పితా తస్య రావణ ః**
**ప్రథమ సర్గ 39 శ్లో.**

అతడు దేవేంద్రుణ్ణి కూడా ఎట్లు జయించాడు? వరములు ఎట్లు పొందాడు? కుమారుడే ఎట్లు అధిక బలవంతుడు? తండ్రి ఎందువలనకాదు? అని రాముడు ప్రశ్నించాడు.

మూ. **కథం పితుశ్చావ్యధికో మహాహవే**
**శక్రస్య జేతా హి కథం స రాక్షసః**
**వరాశ్చ లబ్ధాః కథయస్వ మే ధ్య**
**తత్పృచ్ఛతశ్చాస్య మునీస్ద్ర సర్వమ్.**
**ప్రథమ సర్గ 40 శ్లో**

ఓ మునీంద్రా! ఆ రాక్షసుడు తండ్రికంటే ఎట్లు గొప్పవాడు? మహా యుద్ధంలో ఇంద్రుణ్ణి ఎలా జయించగలిగాడు? వరము లెట్లు పొందాడు? అడుగుచున్న నాకు ఇతనికి సంబంధించిన ఈ విషయములన్నీ చెప్పగలవని ఆశిస్తున్నాను" అని రాముడు అగస్త్యుణ్ణి మొరపెట్టుకున్నాడు. (అదే పుస్తకం; పేజీ: 14)

ఇందుకు అగస్త్యుడు రాముడికి ఇలా వివరణ ఇచ్చాడు.

**నాను కీర్త్యా గుణా స్తస్య ధర్మతః శీలత స్తథా,**
**ప్రజా పతేః పుత్ర ఇతి వక్తుం శక్యం హి నామతః**
**ద్వితీయ సర్గ 5 శ్లో.**

అతని ధర్మమునకు శీలమునకు సంబంధించిన గుణములు వర్ణింప శక్యములు కావు. అతనిని పేరు చేత ప్రజాపతి పుత్రుడనియే చెప్పవలెను అని ఇంద్రజిత్తు గురించి చాలా గొప్పగా చెప్తాడు.

అయితే రాక్షసులుగా పుట్టిన వీరు చంపడానికి అర్హులు, శాపగ్రస్తులు అని అగస్త్యుడు రాముడికి చెప్తాడు. ఇక్కడ అగస్త్యుడు తన కథా కథన చాతుర్యాన్ని చూపించాడు. ఋషులు తపస్సు చేసుకొంటున్నపుడు ఆనార్యుల ఆడపిల్లలు చెడగొట్టేవాళ్ళని, వారికి గర్భధారణలు జరిగేవని, వారికి పుట్టినపిల్లలు తపస్సుచేసి వరాలు పొందేవారని వారు రాక్షసులుగా ఆవిర్భవించేవారని, వారి అహంకారానికి త్రిలోకాలు తల్లడిల్లేవని వారిని చంపడానికి విష్ణువు అనేక అవతారాలు ఎత్తేవాడని రాక్షసులని చంపటం తప్పుకాదని వివరించాడు.

**రాక్షసులపై దుష్ప్రచారం**

ఇక్కడ అభూత కల్పనలలేకాక రాక్షసులు సంకర సంతానులని, అంతే గాక వారు అత్యాశాపరులని చెబుతూ ఆర్య ఋషులు ప్రచారం చేశారు. తమ రాతల్లో వారి పేర్లన్నీ దుష్టమైనవిగా పెట్టారు. ఈ కథనం దేశీయ ప్రజలను అవమానించడానికి చేసిన ప్రయత్నం తప్ప మరొకటికాదు. దేవతలు ఋషులు, మరొక ప్రక్క రాక్షసులు. ఈ రాక్షసులకు ఇష్టదైవం శివుడు అని తేల్చారు. ఏనాటికైనా బ్రాహ్మణీకరించడానికి వీలుగా ఈ కథనాన్ని వాల్మీకి పేరున అల్లారు.

పులస్త్యుడనే ఋషి మంత్రం విని తృణబిందువనే రాజర్షి పుత్రిక గర్భవతి అవుతుంది. ఈమెకు పౌలస్త్యుడు అనే కొడుకు పుడతాడు. ఇతడు ఉభయ వంశాలకు మూలమయ్యాడు.

ఈ కథలు అల్లడంలో హిందూ పౌరాణిక కర్తలు అద్వితీయ విజయాన్ని సాధించారు. మూలవాసులను హిందూ పునరుద్ధరణ వాదానికి గురిచేసి ఏనాటికైనా మీరూ మాలోని భాగమే అని చెప్పడానికి వీలుగా కూడా కథనాలు మల్చుకొన్నారు.

మరో వైపు దేశీయులను శత్రువులుగా నిర్ధారించి వారిని చంపడం తప్పుకాదనే వాదనను నమ్మబలికారు.

చాలాకాలం దేశీయులు ఆర్యుల మీద యుద్ధం చేస్తూనే వచ్చారు. ఆర్యులు దేశీయులను జయించలేక పోయారు. స్వయంగా బ్రహ్మదేవుడే వచ్చి రావణుడిని జయించటం సాధ్యంకాదు. అతనితో స్నేహమే మీకు మంచిది అని చెప్పినట్టు వాల్మీకి ఇలా పేర్కొన్నాడు.

మూ. **న హ్యయం రావణో యుద్ధే శక్యో జేతుం సురాసురైః**
**న భవన్తః క్షయం నేతుమపి సామరదాన వైః**
**ద్వావింశ సర్గ 12 శో.**

సురులు అసురులు కూడ ఈ రావణుణ్ణి యుద్ధములో జయించజాలరు. దానవులు, దేవతలూ కలిసివచ్చినా కూడా మిమ్ములను ఓడింపజాలరు.

మూ. **రాక్షసస్య సఖిత్వం భవద్భిఃసహ రోచతే,**
**అవిభక్తాశ్చ సర్వార్థాః సుహృదాం నాత్ర సంశయః**
**ద్వావింశ సర్గ 13 శో.**

మీరు ఈ రావణునితో మైత్రి వహించుట నాకిష్టము. మిత్రులు అన్ని భోగములను వంచుకొనకుండా కలిసి అనుభవించవచ్చును. సందేహము లేదు. (అదే పుస్తకం; పేజీ: 341)

అది భారతీయులను రాక్షసులుగా చిత్రించడానికి కారణం వారిలోని యుద్ధ సామర్థ్యమే. భారతదేశానికి ఆర్యులు వచ్చే నాటికే బహుజన రాజ్యాలు అనార్యుల పాలనలో వున్నాయి. అవి బలంగా వున్నాయి. శక్తివంతంగా శత్రువుని నిర్జించే దశలో వున్నాయి. అప్పటికి వారికి లిపి లేదు. వారి సాహిత్యమూ, సంస్కృతి మౌఖిక రూపంలో వుంది. ఆర్యులు అనార్యులైన వారికే కొందరికి సంస్కృతాన్ని నేర్పి తమ కథలను గొప్పగా రాయించుకున్నారు. వారు యుద్ధ జాతులని, నీతివంతులని, అనార్యులు శాపగ్రస్తులు కాబట్టే వారిని మేం చంపామని నమ్మబలికారు. ఈనాటి దళితుల సామాజిక సాంస్కృతిక చరిత్ర ఈ రహస్యాన్ని బయట పెడుతున్నాయి. వారు చెప్పిన కథల్లోని వైరుధ్యాల నుంచే ఈ రహస్యాలను బయట పెట్టడం ఈ పరిశోధనలోని ఒక లక్ష్యం. దీనివల్ల దళితులకు తాము ఎందుకు అస్పృశ్యులమయ్యామో అనే చరిత్ర మనకు తెలియ వస్తుంది.



# మేడే

ఝాన్సీ కె.వి. కుమారి
9010823014



'మేడే... ఈనాడే
విజయధ్వానాల సందడే
విప్లవ జ్యోతుల సవ్వడే
అమానుషమేకుల సంకెళ్ళు వీడే!
కార్మిక సంతసదినమిదే
అమరవీరుల పోరు ఫలితమిదే
అందివచ్చిన జీవఫలమిదే
శ్రామిక జనగుండెల్లో
ఎగసిపడే ఉత్సవ గీతమిదే!

ఉద్యమాలు విప్లవిస్తేనే
విజయాలు సొంతమయ్యేది
ఏటికి ఎదురీదే పోరాట చీమలే
యుద్ధ పాఠశాలలో
ప్రథమ ఉపాధ్యాయులు!

ప్రవాహంలో కొట్టుకుపోయే
పుడకలు... నిర్జీవులు
నవశకాన్ని రగిలించగలవా...?
ప్రశ్నించలేని మెదళ్ళు
చీకట్లను ఛేదించగలవా...?

స్వార్థం అసమానతలకు మూలం
అన్యాయాలకు ఆలవాలం
రూపాయి పెట్టుబడితో పాడు
దేహాలను యంత్రాలుగా చేశాడు
స్వేదబిందువులను కాదు
రుధిరధారల నిండు ప్రాణాలను
రూపాయిల రాసులుగా
మలిచాడు...
కోట్ల కొండలపై ఆశీనుడయ్యాడు!

శ్రమ ఎరుగని పేరాసైట్లు
ప్రపంచానికి సెలబ్రిటీలు!

కష్టించిన వాడికి తిండి కరువాయె
కష్టమెరుగనివాడికి క్షణక్షణమూ
పండగాయె

ప్రశ్నల ఫలితమే
'మే'డే విజయోత్సవం, కామ్రేడ్
అన్యాయాలపై యుద్ధమే
'మే'డే ప్రభంజనం
నీ చీకటికి నువ్వు సిగ్గుపడడమే
విప్లవం!

కళ్ళు మెదళ్ళు తెరుచుకోవడమే
నవనవోన్మేషం!
సంకెళ్ళను గుర్తించడమే
స్వాతంత్ర్యం!
ప్రయాసపడి భారం మోసే నీకు
విశ్రాంతి పిలుపు విన్పిస్తూనే
ఉంటుంది... స్వేచ్ఛారాగాన్ని శ్రుతి చేస్తూ
చీకట్లతో పోరాడే నిన్ను
వెలుగు పుంజం
స్వాగతిస్తూనే ఉంటుంది...
ఆనంద గీతం నినదిస్తూ...
'మే' డే విజయధ్వానాల సందడే!
విప్లవజ్యోతుల సవ్వడే!!

# కలం కదిలితే !!

తవ్వా వెంకటయ్య



కాలంతో పాటు
కలం కదిలితే !
ప్రతిఘటనలేని
పోరాటాలు ప్రతిధ్వనిస్తాయి
ఒక్కప్రాణం
వెయ్యి తూటాల ప్రతినిదౌతుంది
నడిరాత్రి
నెత్తుటి మరకలు విప్లవకేకలేస్తాయి
నీతి కోసం వెతికే కళ్ళు
అవినీతిని పాతేస్తాయి
మత్తువిండిన కళ్ళు
పగలబడి నవ్వేస్తాయి
అర్ధనాదాల నినాదాలు
గొంతు నులుముకుని చస్తాయి
మూసుకున్న నోర్లు
తమ నాలుకను కొరుక్కుంటాయి
పరుగులు తీసే పాదాలు
అధికారాన్ని తొక్కేస్తాయి
కలం కదలితే
కత్తికంటే వేగంగా
అప్రజాస్వామ్యపు నెత్తురును
జుర్రేస్తుంది.

# ధిక్కార నానీలు

- గురజాడ శోభాపేరిందేవి



అవినీతిని
అంతమొందిస్తాం
అంధత్వమున్నా
అంతే గమనిస్తాం

మేము ప్రపంచాన్ని
పర్‌ఫెక్ట్‌గా పాలించగలం
రుచి చూస్తే
ఓట్లు మాకే

వీరుడెక్కడో లేడు
ఇక్కడే ఉన్నాడు
వైకల్యంతో
పోరాడుతున్నాడు

పాకులేనని
పరిహసించవద్దు
పాకులాడేది
ప్రాపకానికి కాదుగదా !

నిన్న ఏడ్చిన నింగి
నేడు ముఖం కడిగింది
లేజీగా పిలిచింది
సూర్యుడ్ని.

## ఏప్రిల్ నెల పురస్కారాలు





| | |
|---|---|
| **పాత్రోపదేశం** | **అమరుడా...! అజేయుడా...!!** |
| కథకు........రూ.700/- | కవితకు.......రూ.500/- |
| రచయిత : సాహిత్యప్రకాశ్ | రచయిత : పి. గోపీనాథ్ |

**సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

- ఎరుకలపూడి గోపీనాథరావు

9848293119

# మద గజోపాఖ్యానం



ఆ రోజులలో తెల్లఏనుగుల మందలు వీధి, వీధీ విహరిస్తూ,
జబర్దస్తీగా జనావాసాలపై దండెత్తుతూ,
అడ్డగించిన వారిని ఆటవిక పదఘట్టనలతో అణచివేస్తూ,
స్వేచ్ఛాకాంక్షలను వెలగపండ్లలా కబళిస్తుండేవి!

కొన్నాళ్ళకు.... సమరయోధాగ్రేసర భద్రగజాలు కొన్ని
ఆ మదమత్త శ్వేత మాతంగాలను తరిమికొట్టి
బాధితులందరికీ, బానిసలందరికీ
స్వేచ్ఛను, సంతోషాన్ని, అభయాన్నీ అందిస్తూ
స్వాతంత్ర్య పతాకాన్ని తమ మూపుల అంబారీలపై
ఊరేగించి సంబరాలు జరుపుకున్నాయి!

ఆ తర్వాత... నయవంచన నేర్చిన నల్ల ఏనుగులు కొన్ని
భద్రగజాలను - సద్వర్తనల బంధనాలలో కట్టివేసి
ప్రజాసేవ ముసుగులో తాము చెలరేగి
జనజీవన క్షేత్రాలను ధ్వంసంచేస్తూ, ధరాపటలం చేస్తూ,
స్వరాజ్యపు స్వరూపమే మార్చివేయసాగాయి!
పాపపు బుద్ధే మావటీగా మారి మనసును కదం త్రొక్కిస్తూవుంటే
గజానికీ గజానికీ ఒక గజాసురాంశం పుట్టుకొస్తూ
సాధుజీవుల సర్వస్వాన్నీ స్వాహాజేస్తూ స్వైర విహారం చేయసాగింది!
వెఱ్ఱెత్తి బీభత్సం సృష్టిస్తున్న కరిసమూహాల ధాటికి కకావికలౌతూ
జనసమూహం జాలిగా రోదించే రోజులొచ్చాయి!

చిట్టెలుకలను పట్టే బోనులూ,
పావురాలను బంధించే పంజరాలే మన దగ్గరున్నాయిగానీ
బరితెగించి బాధలుపెట్టే ఏనుగులను బంధించే ఏర్పాటేదీ జరగడం లేదు!
అయినా... ఇంకెంతకాలం యీ అఘాయిత్యాలు...?
దానవభావ దంతిదంతాలను పెటికిపారేసే దక్షులు
త్వరలో అవతరించకమానరు!
కుత్సిత కుంభి కుంభస్థలాలను కృంగదీసి, క్రుమ్మి క్రుళ్ళగించే
ఐరావత కులసంభవుల కూటమి తన ప్రతాపాన్ని ప్రదర్శించక మానదు !

# ప్రపంచ సాహిత్యంలో గనుల తవ్వకాలు కార్మికులు, స్త్రీలపై దోపిడి

కె. సుభాషిణి
9440254730



పూర్వం ఆహారం తయారు చేసుకోటానికి వంటచెరుకు కోసం కట్టెలు వాడేవారు. కట్టెల కోసం అడవులను నరుకుతుండడంతో మెల్లిగా అడవుల విస్తరణ తగ్గడం మొదలయ్యింది. ప్రత్యామ్నాయం కోసం అన్వేషించే క్రమంలోనే భూమిలో దాగున్న ఇంధన వనరులను కనిపెట్టటం జరిగింది. గ్యాస్, కిరోసిన్ అనే చమురు పదార్థాలు భూమిలో లభ్యం కాకుంటే, విపరీతంగా పెరిగిపోయిన జనాభా, వారి అవసరాల రీత్యా ఈ పాటికి ప్రపంచంలో అడవులే కాదు చిన్నపాటి మొక్క కూడా మిగిలి వుండేది కాదు.

సమాజం అభివృద్ధి కొరకు, మానవుల అవసరాల కోసం ప్రకృతిలో భాగంగా వున్న ఖనిజాలను వెలికి తీయటం మొదలు పెట్టారు. ఖనిజాలను తవ్వి తీయటంతోనే నాగరికత అభివృద్ధి వెల్లి విరిసింది. ఇనుము లేని సమాజాన్నీ, బొగ్గు లేని పారిశ్రామిక రంగాన్నీ ఊహించలేము. ఆవిరి యంత్రాలు నడిచిందే బొగ్గు మీద, రవాణ సౌకర్యాలు ముఖ్యంగా రైళ్లు వాటికి మొదట్లో బొగ్గే ఆధారం. వ్యవసాయానికి అవసరమైన పనిముట్లు, వాహనాలు, భవనాలు, వంతెనలు మొదలగువాటికి మూలాధారం ఇనుము.

పూర్వం ఆహారం తయారు చేసుకోటానికి వంటచెరుకు కోసం కట్టెలు వాడేవారు. కట్టెల కోసం అడవులను నరుకుతుండడంతో మెల్లిగా అడవుల విస్తరణ తగ్గడం మొదలయ్యింది. ప్రత్యామ్నాయం కోసం అన్వేషించే క్రమంలోనే భూమిలో దాగున్న ఇంధన వనరులను కనిపెట్టటం జరిగింది. గ్యాస్, కిరోసిన్ అనే చమురు పదార్థాలు భూమిలో లభ్యం కాకుంటే, విపరీతంగా పెరిగిపోయిన జనాభా, వారి అవసరాల రీత్యా ఈ పాటికి ప్రపంచంలో అడవులే కాదు చిన్నపాటి మొక్క కూడా మిగిలి వుండేది కాదు.

అవసరాల కోసం మొదట సమిష్టిగా పనిచేసిన మానవులు కాలక్రమేణ వర్గాలుగా విడిపోయారు. అధిక సంపదను పోగు చేసుకోవాలనే దురాశతో ఖనిజాల కోసం వేట ప్రారంభించారు. ఖనిజ నిల్వలు వున్న ప్రాంతాల కోసం అన్వేషించి వాటిని కనుగొని వాటిపై గుత్తాధిపత్యం సాధించారు. దీనితో ప్రకృతి సిద్ధమైన ఖనిజాలు వాటి ఫలితాలు సమాజంలో అందరికి అందకుండా పోయాయి. ఖనిజాలను తవ్వి పోయటానికి బానిసలు, కూలీలను ఏర్పాటు చేసుకున్నారు. కూలీలకు కనీస సౌకర్యాలు కూడా ఏర్పాటు చేయకుండా, పశువులకన్నా నీచంగా వారిని హింసిస్తూ, తక్కువ వేతనాలు యిస్తూ అధిక లాభాలు పొందసాగారు గనుల యజమానులు.

న్యూబియా ఎడారి కాకనస్ పర్వతాలల్లో రాగి కోసం తవ్వకాలు, అందులో పనిచేసే బానిసలు, వారి కఠోర శ్రమ, ఆకలి, ప్రమాదాలు, యజమానుల క్రౌర్యం మొదలయినవన్ని హూవర్డ్ ఫాస్ట్ ప్రపంచ ప్రసిద్ధి పొందిన స్పార్టకస్ నవలలో కనిపిస్తాయి. బానిసలను గొలుసులతో కట్టివేసి గాలి వెలుతురు కరువయిన నల్లరాతి పలకలతో కట్టిన బారకాసులలో వారికి నివాసం కల్పించటం, ఎండిపోయి రాయిలాగా వున్న బార్లీ రొట్టెలను పరిమితంగా పడేయటం. తోలు సంచులల్లో కేవలం శేరు నీళ్లు మాత్రమే పోసి యిస్తే అవి నాలుక తడుపుకోటానికి కూడా సరిపోయేవి కాదు. నీళ్లు చాలక మూత్రకోశ వ్యాధుల బారిన పడిన వారిని నిర్లక్ష్యంగా ఎడారిలో వదిలివేయడమో లేక చంపివేయటమో చేసేవారు. అంటే ఎవరి శ్రమతో అయితే అంతులేని లాభాలు సంపాదించారో ఆ శ్రమజీవులను గడ్డిపూచ కన్నా హీనంగా చూసే దోపిడి స్వభావాన్ని రచయిత తెలియజేసారు. స్పార్టకస్ మరణం తర్వాత ఆయన భార్య వరీనియా స్పార్టకస్ జీవితాన్నీ, దౌర్భాగ్యపు గనులలో అతను పడిన కష్టాల గురించీ రోమ్ సామ్రాజ్యాన్ని నాలుగేళ్లపాటు గడగడలాడించిన వైనాన్ని గురించి కళ్లకు కట్టినట్టుగా కథలుగా చెప్తూ బానిసలు తిరుగుబాటు చేస్తే తప్ప స్వేచ్ఛ లభించదని ఆనాడే చాటి చెప్పిన ధీరవనితా వరీనియా.

ప్రఖ్యాత రచయిత విక్టర్ హ్యూగో 19వ శతాబ్దం తొలి దినాల్లో ఇంగ్లండ్, ఫ్రాన్స్ దేశాలలోని బొగ్గు గనులు అందులో కార్మికుల పనితీరు, వేతనాలు ముఖ్యంగా స్త్రీల పరిస్థితుల గురించి పరిశోధన చేసి "women and work" అనే వ్యాసాన్ని వ్రాశారు. నడుములకు గొలుసులు కట్టుకొని మోకాళ్లు, చేతుల మీదుగా పాకుతూ బొగ్గును మోసుకొని పైకి తీసుకొచ్చే విధానం గురించి చెబుతూ గాడిదలు, గుర్రాలు మాత్రమే చేయగలిగే పనిని స్త్రీలు, పిల్లల చేత చేయించేవారని, దీనికి కారణం గాడిదలు, గుర్రాలు వాటికి అయ్యే ఖర్చు కన్నా స్త్రీలకు యిచ్చే వేతనాలు తక్కువగా వుండటమే అని అంటారు. పురుషులు పొందే వేతనాల్లో స్త్రీలకు కేవలం 1/3 వ భాగం మాత్రమే అందేదని ఎవరైనా ఈ అన్యాయం గురించి ప్రశ్నిస్తే" స్త్రీలు తమ శరీరాన్ని అమ్ముకుంటూ ఆ లోటును భర్తీ చేసుకోగలరు, కాబట్టి మగవాళ్లతో సమానంగా వారికి వేతనాలు యివ్వవలసిన అవసరం లేదు..." అని గని యజమానులు నిస్సిగ్గుగా వ్యాఖ్యానిస్తూ స్త్రీలను ఆర్థికంగా అణచి వుంచడమే కాక నైతికంగా కూడా వారిపై దాడి చేసేవారని అర్థమవుతుంది. ఇంగ్లండ్‌లో నాగరికతకు పునాదులు వేసింది క్రిస్టియానిటి అన్న ప్రచారానికి విక్టర్ హ్యూగో స్పందిస్తూ... బొగ్గు గనులలో పని చేసే స్త్రీల దగ్గర క్రీస్తు ప్రస్తావన తెచ్చినపుడు. "క్రీస్తు అంటే ఎవరు? బొగ్గు మోసే మనిషా?'' అని ఆ స్త్రీలు అమాయకంగా ప్రశ్నించారు అని వారితో తన అనుభవం గురించి వ్రాసుకున్నారు. అంటే ఆ స్త్రీలు రోజులో ఎక్కువ భాగం బొగ్గుగనులలోనే శ్రమించేవారని, అదే తమ ప్రపంచంగా భావిస్తూ బయట ప్రపంచంతో సంబంధం లేకుండా వుండేవారని, తమ మీద జరిగే దౌర్జన్యాలను, దోపిడీలను, అత్యాచారాలను ప్రశ్నించగలిగే చైతన్యం వారిలో నామమాత్రంగా కూడా లేదని ఈ రచన ద్వారా మనకు తెలుస్తుంది.

**నడుములకు గొలుసులు కట్టుకొని మోకాళ్లు, చేతుల మీదుగా పాకుతూ బొగ్గును మోసుకొని పైకి తీసుకొచ్చే విధానం గురించి చెబుతూ గాడిదలు, గుర్రాలు మాత్రమే చేయగలిగే పనిని స్త్రీలు, పిల్లల చేత చేయించేవారని, దీనికి కారణం గాడిదలు, గుర్రాలు వాటికి అయ్యే ఖర్చు కన్నా స్త్రీలకు యిచ్చే వేతనాలు తక్కువగా వుండటమే అని అంటారు. పురుషులు పొందే వేతనాల్లో స్త్రీలకు కేవలం 1/3 వ భాగం మాత్రమే అందేదని ఎవరైనా ఈ అన్యాయం గురించి ప్రశ్నిస్తే" స్త్రీలు తమ శరీరాన్ని అమ్ముకుంటూ ఆ లోటును భర్తీ చేసుకోగలరు, కాబట్టి మగవాళ్లతో సమానంగా వారికి వేతనాలు యివ్వవలసిన అవసరం లేదు..." అని గని యజమానులు నిస్సిగ్గుగా వ్యాఖ్యానిస్తూ స్త్రీలను ఆర్థికంగా అణచి వుంచడమే కాక నైతికంగా కూడా వారిపై దాడి చేసేవారని అర్థమవుతుంది.**

సైనికుడికి ఆయుధమెంత అవసరమో కార్మికుడికి సమ్మె హక్కు అంతే అవసరం. ఆయుధం లేకపోతే సైనికుడు ఓటమి పాలవుతాడు. మరణిస్తాడు. సమ్మె అనే ఆయుధం లేకపోతే కార్మికుడికి మనుగడే లేదు అన్న కార్మిక వర్గ స్పృహతో శ్రమజీవి ప్రచురణలు "సమ్మె" శీర్షికతో పదకొండు కథల సంకలనాన్ని ప్రచురించారు. సింగరేణి బొగ్గు గనులలో పని చేసే కార్మికుల జీవన స్థితిగతులకు ఈ కథలు అద్దం పడుతున్నాయి. కంపెని యాజమాన్యం, వారి ప్రయోజనాలను కాపాడే పాలక, పోలీస్ వర్గాల దుర్మార్గాలను ఎత్తి చూపుతూ కార్మికులు తమ హక్కుల కోసం ఐక్యంగా ఎలా పోరాటం చేయాలో చెప్పిన కథలివి. ఒకవైపు కార్మిక సంఘాలకు నాయకత్వం వహిస్తూ యింకొకవైపు యాజమాన్యాలతో చేతులు కలిపే దొంగ ట్రేడ్ యూనియన్ నాయకుల అసలు రంగును కూడా ఈ కథలు బయటపెట్టాయి. కేవలం సమ్మె పేరుతోనే ఈ సంపుటిలో ఐదు కథలున్నాయి. మస్టర్ల కోత చట్టాలకు వ్యతిరేకంగా, వేజ్ బోర్డు అమలు కోసం, డిపెండెంట్ హక్కు కోసం, జామ్ ల కోసం, గనులల్లో జరిగే ప్రమాదాలను నివారించే రక్షణ కోసం రాసిన యదార్థ గాథలివి. కార్మిక, పి.చంద్ పేర్లతో రెండు కథలు వుంటే మిగిలిన కథలకు రచయితల పేర్లు యివ్వలేదు.

వ్యవసాయం గిట్టుబాటుకాకనో లేక కూలీల మీద భూస్వాములు చేసే దౌర్జన్యాలకు భయపడో తెలంగాణ ప్రాంతాలల్లో పేదలు వేరే గత్యంతరం లేక బొగ్గుబావి పనిలోకి వచ్చారు. ఇక్కడ పరిస్థితులను చూసి భీతిల్లిన కార్మికులను చూసి "సమ్మె" (రచయిత పేరు ఇవ్వలేదు) కథ రాసిన కథకుడు" బాయిపనికి వచ్చి మల్లయ్య బావుకున్నది లేదు. వ్యవసాయం చేసుకుంటున్న అన్నదమ్ములు బాగుపడలేదు. (సమ్మె కథా సంకలనం, సమ్మె-2 పుట-115) అంటారు. దోపిడి దౌర్జన్యాలకు భూస్వామ్య వ్యవస్థ అయినా పెట్టుబడిదారి వ్యవస్థ అయినా ఒకటే! భూస్వామ్య వ్యవస్థలో శత్రువు ప్రత్యక్షంగా కనిపిస్తే పెట్టుబడిదారి వ్యవస్థలో పెట్టుబడిదారుని తరుపున చిన్న, పెద్ద అధికారులు పెత్తనం చెలాయిస్తారు. అక్కడా సమస్యలే... ఇక్కడా సమస్యలే... సమస్యల రూపాలు మారుతున్నాయి కాని పేదరికం, ఆకలి, అణచివేత మాత్రం ఏం మారలేదు అన్న విషయం "నిర్బంధం" అనే కథలో గుర్తించిన బక్క ఎంకులు" ఇక్కడికొచ్చి ఏం బావుకున్నాం. అక్కడెట్లున్నదో ఇక్కడ గట్లనే వున్నది. అక్కడ భూమి దొరలు సాగనిత్తలేరు. ఇక్కడ బాయి దొరలు సాగనిత్తలేరు. ఎక్కడికి పోయిన ఒక తీర్గనే వున్నది. ''(సమ్మె కథా సంకలనం, "నిర్బంధం" పుట-52. రచయిత పేరు యివ్వలేదు). దీనికి సమాధానంగా రాయమల్లు" (గ్రామాల్లో భూస్వాములకు ఎదురు నిల్వలేక, బతుకులు సాగక మనమెన్ని బాధలు పడ్డామో ఇక్కడ అంతకు రెట్టింపుగానే వున్నాయి. గుది గుచ్చి నట్టుండే మన గుడిసెల్లో బొగ్గుగాలికి ఊపిరి ఆడక దగ్గుదమ్ముతో మన ఊపిరితిత్తులు గుల్లయిపోతున్నాయి... ఏనుగులాంటోళ్లు పీస్కులైపోతాండ్రు. బయట పరిస్థితి యిలాగుంటే బాయిల పరిస్థితి మరీ అధ్వానంగా వుంది. ఏ రోజుకారోజు ఇంటికి తిరిగొస్తమన్న నమ్మకం లేదు. చీకటి పొక్కులటువంటి బొగ్గుబాయిల మైళ్ల కొద్ది నడిచిపోయి భూదేవితో భూమిపొరల మధ్య మన రక్తమంతా నీళ్ళు చేసుకొని బొగ్గు బయటికి తీసుకొస్తం (సమ్మె కథా సంకలనం, "నిర్బంధం" పుట-52). నిరంతరం ప్రమాదం అంచుల్లో బతుకుతూ

ప్రాణాలు పణంగా పెట్టి బొగ్గు తీసే కార్మికుల పరిస్థితి ఎలా వుందో అర్థమవుతుంది.

తుమ్మేటి రఘోత్తమ రెడ్డి "నల్ల వజ్రం" నవలికలో దిగజారిపోయిన ఆరోగ్యపరిస్థితి కారణంగా టెన్ యింకులైన్ నుండి వన్ యింకులైన్‌కు బదిలీ చేయించుకోవడానికి బావి దొరలకు రక్తదానం కూడా చేస్తాడు బొగ్గుగని కార్మికుడు శంకరన్న. అయితే ఆ ప్రయత్నం కూడా విఫలం అవుతుంది. అంతే కాకుండా పై అధికారిని ఎదిరించాడనే నెపంతో శంకరన్నను జైలుకు పంపుతుంది కంపెనీ యాజమాన్యం. జైలులో తోటి ఖైదీలు, కార్మికుల సహచర్యంతో శంకరన్న సంఘ నిర్మాణానికి, సమ్మెలో పాల్గొనడానికి సన్నద్ధుడవుతాడు. శంకరన్న అనారోగ్యంతో వున్నప్పుడు జైలు పాలయినప్పుడు అతని భార్య పడే ఆరాటాన్ని రచయిత చాలా సున్నితంగా ఈ నవలికలో చూపిస్తారు.

సింగరేణి బొగ్గుగని కార్మికులు సమ్మె చేస్తే దాని ప్రభావం ఎంత తీవ్రంగా వుంటుందో... ఎరువుల కంపెనీలు, ధర్మల్ విద్యుత్తు ప్రాజెక్టులు మూతపడే ప్రమాదం వుందని ఈ కథలు హెచ్చరిస్తాయి. అది నిజమని 2010లో చేపట్టిన సకల జనుల సమ్మెలో భాగంగా సింగరేణి బొగ్గుగని కార్మికులు సమ్మె చేసినప్పుడు ప్రజలు ఎంత గడ్డు పరిస్థితులు ఎదుర్కొన్నారో అందరికి గుర్తు వుండే వుంటుంది. ఆ రోజు నుండి ఈ రోజు దాకా అమలు అవుతున్న కరెంట్ కోతలే అందుకు నిదర్శనం. వాళ్లెవరో సమ్మె చేస్తే మేము ఎందుకు బాధలు పడాలి అనే వాళ్లు ఎప్పుడయినా బొగ్గుబావిలో పనిచేసే వారిని గురించి ఆలోచించారా? మల్లయ్య రాయమల్లు, శంకరన్న, ఓదేలు, ఎల్లారెడ్డి, లింగయ్య, నర్సయ్య లాంటి వారి జీవితాలు ఎంత దయనీయంగా వుంటాయో, ఎంతటి ప్రమాదాలతో కూడుకున్నవో తెలుసుకోవాలంటే ఈ కథలు చదవాలి.

సింగరేణి బొగ్గుగని కార్మికులు సమ్మె చేస్తే దాని ప్రభావం ఎంత తీవ్రంగా వుంటుందో... ఎరువుల కంపెనీలు, ధర్మల్ విద్యుత్తు ప్రాజెక్టులు మూతపడే ప్రమాదం వుందని ఈ కథలు హెచ్చరిస్తాయి. అది నిజమని 2010లో చేపట్టిన సకల జనుల సమ్మెలో భాగంగా సింగరేణి బొగ్గుగని కార్మికులు సమ్మె చేసినప్పుడు ప్రజలు ఎంత గడ్డు పరిస్థితులు ఎదుర్కొన్నారో అందరికి గుర్తు వుండే వుంటుంది. ఆ రోజు నుండి ఈ రోజు దాకా అమలు అవుతున్న కరెంట్ కోతలే అందుకు నిదర్శనం.

ఇరుకు సందులు, మురికి కాల్వలు, గాలి వెలుతురు లేని, నిలబడితే వాశాలు తగిలే గుడిసెలు, దోమల వలన సరి అయిన నిద్ర లేక అవస్థపడే సింగరేణి బొగ్గుబావి కార్మికులు నివసించే వాడలను గురించిన వర్ణన, వారి దయనీయమైన జీవితాలను గురించి తుమ్మేటి రఘోత్తమ రెడ్డి వ్రాసిన "బొగ్గు పొరల్లో", "పురుడు", "ఇల్లు", "నీళ్ల తగువు" లాంటి కథల ద్వారా తెలుస్తుంది "పురుడు" కథలో చదువులకు దూరమవుతున్న పిల్లల గురించి "లాగులు లేక కొందరు, అంగీలు లేక కొందరు పిల్లలు. అదే ఇరుకు సందు గొందుల్లోఏవో అడ్డదిడ్డపు ఆటలు ఆడుతున్నారు. వాళ్లకు తోడు పందులు కూడా మురుగు కాల్వల్లో దొర్లుతున్నాయి" అంటూ కథకుడు ఆందోళన చెందుతాడు. కంపెనీ ఏర్పాటు చేసిన బడిలో కార్మికుల పిల్లలకు సీటు దొరకడం దాదాపు అసాధ్యం కాగా వేరే బళ్లల్లో చదివించుకోడానికి శక్తికి మించిన ఫీజులు వుండటంతో బొగ్గుగని కార్మికులు తమ పిల్లలకు సరి అయిన చదువులు అందించలేకపోయారు. వేరే గత్యంతరం లేక వాళ్ల కాళ్లు వీళ్ళ కాళ్లు పట్టుకొని యిష్టం లేకున్నా బావిపని కష్టం, ప్రమాదం అని తెలిసి కూడా తమ పిల్లలను బొగ్గుబావి పనిలోకి దింపేవారు. ఈ విషయం మీదనే "పురుడు" అనే కథలో తండ్రి అయిన ఒక కార్మికుడు తన కొడుకుకు పేరు సూచించమని బొగ్గుబావిలో పని చేసే సీనియర్ కార్మికున్ని అడిగితే దానికి సమాధానంగా "ఏ పేరు పెడితేమున్నదిర.. కోల్ పిల్లరోనికి కొడుకు పుడితే అయ్యేది బదిలీపిల్లరేరా..." అంటూ తన కొడుకుకు చదువు చెప్పించలేక బొగ్గుబావి పనిలోకి ఎలా బలవంతంగా దింపింది గుర్తు చేసుకొని ఏడుస్తాడు ఓదేలు.

2010 ఆగస్ట్ 5న చిలీలోని ఆటకామా ఎడారిలో 121 సంవత్సరాల శాన్ జోస్ అనబడే ఒక చిన్న రాగి. బంగారు గనిలో జరిగిన ప్రమాదము తర్వాత ప్రపంచ వ్యాప్తంగా 19,20 శతాబ్ధాలలో గనులకు సంబంధించి వచ్చిన సాహిత్యాన్ని మళ్ళీ తిరగతోడారు. ప్రపంచ సాహిత్యాన్ని పరిశీలిస్తే చాలా మంది రచయితలు బొగ్గు గనులల్లో పని చేసే కార్మికులు వారి కష్టాలు, శ్రమ, కార్మిక కుటుంబాల ఆర్థిక స్థితిగతులు, కార్మికులు ప్రమాదాలకు గురి అయితే ఆ కుటుంబాలలోని వృద్ధులు, స్త్రీలు, పిల్లల పరిస్థితి వారి జీవితాలు ఎలా చిన్నాభిన్నం అవుతాయో తమ రచనల్లో చెప్పారు. బొగ్గుగనిలో పనిచేసే కార్మికుని కొడుకుగా డి. హెచ్. లారెన్స్ రచనలను గుర్తు చేసుకుంటూ **"Yesterday's Minor's son's stories relate to today's"** అన్నారు. లారెన్స్ రచనలన్ని దాదాపు బొగ్గు గనిలో పనిచేసే కార్మికుల జీవితాలను చిత్రించినవే. బొగ్గుగని కార్మికుల కష్టాలను, ప్రమాదాలను దుఃఖాన్ని అత్యంత శక్తివంతంగా డి. హెచ్ లారెన్స్ తన రచనల ద్వారా పాఠకులకి అందించారు. బాగా ప్రాచుర్యం పొందిన లారెన్స్ రచన **"lady Chatterley's Lover"** నవలలో శ్రీమతి బోల్టెన్ భర్త బొగ్గుగని ప్రమాదంలో చనిపోతే, "ఆయనకు గనిలో పనిచేయడం అస్సలు ఇష్టం వుండేది కాదు కాని వాళ్ళ నాన్న ఆయన్ని బలవంతంగా ఈ బొగ్గు బావి పనిలోకి దింపాడు." అంటూ ఆమె కన్నీరు మున్నీరవుతూ తన పరిస్థితి ఏమిటి అని ఆందోళనకు గురి అవుతుంది. లారెన్స్ యొక్క "Sons and Lovers" నవలలోని శ్రీమతి మోరెల్స్ పాత్ర శ్రీమతి బోల్టెన్ పాత్రకు భిన్నమైనది. మిస్టర్ మోరెల్స్ కేమో తన పెద్ద కొడుకును తనలాగే బొగ్గుగనిలోకే పంపాలనుకుంటాడు. అయితే శ్రీమతి మోరెల్స్ విద్యావంతురాలు కావటం, ఆమె పుట్టి పెరిగిన కుటుంబ నేపథ్యం, సంస్కృతి, ఆలోచన ధోరణి భిన్నమైనది కావటంతో మోరెల్స్ ప్రతిపాదనను వ్యతిరేకించి చాలా పట్టుదలతో తన పిల్లలు నలుగురిని బొగ్గుబావి పనికి దూరంగా వుంచగలుగుతుంది.

గనుల తవ్వకాల సమయంలో జరిగే ప్రమాదాలకు లెక్కే లేదు. భూమి పొరల్లో ఎంతమంది కార్మికుల జీవితాలు సమాధి అయ్యాయో ఊహించుకోడానికి కూడా వీలు కానట్టి పరిస్థితి. గనులల్లో ప్రమాదాలకు గురి అయ్యి కార్మికులు చనిపోతే వారి కుటుంబాలలోని పిల్లలు, స్త్రీల పరిస్థితి అగమ్య గోచరంగా మారుతుంది. కార్మికుల మరణ వార్తను వారి కుటుంబ సభ్యులకు ముఖ్యంగా భార్యలకు ఆ వార్తను చేరవేయాడానికి తోటి కార్మికులు ఎంతగా యాతన పడుతారో అన్న విషయంపై తుమ్మేటి రఘోత్తమ రెడ్డి "బొగ్గు పొరల్లో..." కథలో బండ కూలి ఎల్లారెడ్డి, లింగయ్య సజీవ సమాధి అయినప్పుడు, టింబరింగ్ నర్సయ్య "బంగారంవసోంటి పోరగాండ్లురా... రేపో మాపో ఒగనికి బిడ్డపుడుతర్రా. యింగొగనికి మొన్ననే లగ్గం అయిందిరా! వాళ్ల పెండ్లాలకు ఎవళు జవాబుచెప్తర్ర? ఎవళు సంపింర్రని చెప్తర్ర? మీరేంజెప్తర్ర?" అంటూ గుండెలు బాదుకొని ఏడుస్తాడు. డి.హెచ్. లారెన్స్ కూడా తన రచనలలో బొగ్గు గనులు వాటిలో తరుచుగా జరిగే ప్రమాదాల గురించి ప్రస్తావించాడు. యాజమాన్యం యొక్క నిర్లక్ష్య వైఖరి. ప్రమాదాలకు గురి అయిన కార్మికుల కుటుంబాలకు ఎలాంటి భరోస కల్పించకపోవటం వలన బొగ్గుగని కార్మికుల కుటుంబ సభ్యులు ఎప్పుడూ ఒక అభద్రత భావంతోనే జీవనం కొనసాగిస్తుంటారని లారెన్స్ రచనల ద్వారా తెలుస్తుంది. **"sons and lovers"** నవలలో బొగ్గుగనిలో ప్రమాదానికి గురయ్యి కాలు విరిగి మోరెల్స్ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నప్పుడు ఒకవైపు మోరెల్స్‌కు సేవలు చేస్తూనే యింకొక వైపు శ్రీమతి మోరెల్స్ ఆమె పిల్లలు ఆందోళనకు గురి అవుతారు. లారెన్స్ యొక్క **"odour of Chrysanthemums"** అనే కథలో ఒక యువతి బొగ్గుబావిలో పనిచేసే తన భర్త డ్యూటి నుండి ఎంతకు తిరిగి రాకపోతే యిక తాను విధవరాలు అయిపోతానని భయపడుతుండగానే ఆమె భర్తతో పాటు పని చేసే తోటి కార్మికుడు వచ్చి ఆమె భర్త ప్రమాదంలో మరణించిన విషయం చెబుతాడు. 1939లో **(Richard Llewellyn's)** రిచర్డ్ **"How Green Was my valley"** అనే నవల వ్రాశారు. రాణి విక్టోరియా కాలం నాటి దక్షిణ వేల్స్ ప్రాంతంలోని వెల్ష్ గ్రామంలో బొగ్గుగనులలో పనిచేసే మొర్గాన్స్ కుటుంబ జీవితాన్ని చిత్రించిన నవల యిది. యిందులో ప్రధాన పాత్ర అయిన హూవ్ చదువులో చురుకుగా వుండటమే కాక బొగ్గుగనిలో పని శ్రమతో కూడుకున్నది పైగా ప్రమాదభరితమైనది అని భావించి ఆ పనికి దూరంగా వుంటాడు. గని ప్రమాదంలో హూవ్ పెద్ద అన్న, గని పేలిన సంఘటనలో తండ్రి యిద్దరూ చనిపోతారు. మరణాలతో చిన్నాభిన్నమైన కుటుంబం కోసం హూవ్ పడే ఆరాటాన్ని రిచర్డ్స్ అద్భుతంగా ఈ నవలలో చూపుతారు.

*****

**డి.హెచ్. లారెన్స్ కూడా తన రచనలలో బొగ్గు గనులు వాటిలో తరుచుగా జరిగే ప్రమాదాల గురించి ప్రస్తావించాడు. యాజమాన్యం యొక్క నిర్లక్ష్య వైఖరి. ప్రమాదాలకు గురి అయిన కార్మికుల కుటుంబాలకు ఎలాంటి భరోస కల్పించకపోవటం వలన బొగ్గుగని కార్మికుల కుటుంబ సభ్యులు ఎప్పుడూ ఒక అభద్రత భావంతోనే జీవనం కొనసాగిస్తుంటారని లారెన్స్ రచనల ద్వారా తెలుస్తుంది.**

*****

చాలా కార్మిక వాడలు నగరాలకు దూరంగా ఏర్పడి వుండటంతో గనుల యజమానులు నిత్యవసర సరుకులు అమ్మే అంగళ్లను స్వయంగా ఏర్పాటు చేసి అప్పుయిస్తూ, సరుకులను అధిక ధరలకు అమ్ముతూ, నెలవారి అప్పు తీర్చకపోతే వాటిమీద వడ్డి వసూలు చేసస్తూ కార్మికులను నిరంతరం అప్పుల ఊబిలో కూరుకుపోయెట్టుగా చేసే వ్యాపారుల మోసాల గురించీ, గనులలో పని ప్రమాదాలతో కూడుకున్నది అని తెలిసి కూడా కార్మికుల ప్రాణాల కంటేకూడా లాభాల మీదే దృష్టి వున్న కంపెనీ యాజమాన్యాల గురించి **Gretchen Moran laskas** తన నవల **The miner's Daughter** లో బయట పెడ్తారు. కార్మికుల ప్రాణాలను పూచికపుల్లలాగా తీసి పడేస్తారన్న విషయాన్ని తెలుగు సాహిత్యంలో తుమ్మేటి రఘోత్తమరెడ్డి" బొగ్గుపొరల్లో..." కథలో కూడా చూడవచ్చు. ఎల్లారెడ్డి, మల్లయ్య బొగ్గుబావిలో బండ కూలి చనిపోతే" ఎంతసేపు బొగ్గో బొగ్గని సత్తరుగని ఈ బద్మాష్ కుక్కల కొడుకులు సేఫ్టీ గురించి పట్టించుకోకపోయిరిరా..." అంటూ బొగ్గు యజమానుల నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ కార్మికులు సంఘటితమై వూరేగింపు చేపడతారు. ఈ వూరేగింపులో స్త్రీలు, పిల్లలు, వృద్ధులు అందరూ పాల్గొనడాన్ని చెప్తూ రచయిత బొగ్గు పొరల్లోని జనం కాలే బొగ్గు ముక్కలై అంటుకున్నరు అని కథ ముగిస్తాడు. ఎదురు తిరిగే కార్మికులను బెదిరించడానికి, లొంగదీసుకోడానికి కంపెనీ యాజమాన్యం గుండాలను ఏర్పాటు చేసుకుంటారన్న విషయం **The miner's Daughter** నవలలో చర్చకు వస్తుంది.

ఎమిలీ జోలా వ్రాసిన **(Germinal)** జెర్మినల్ నవల కూడా బొగ్గు గనులలో పనిచేసే కార్మికుల జీవితాలకు సంబంధించినదే. ఉద్యోగం కోసం వెతుక్కుంటూ ఎతైన్ని అనే యువకుడు ఉత్తర ఫ్రాన్స్ ప్రాంతపు మాంట్సొ పట్టణంలోని బొగ్గుగనులు వున్న ప్రాంతానికి వస్తాడు. వృద్ధ కార్మికుడైన బొన్నేమోర్ట్ సహాయంతో బొగ్గు మోసే పని సంపాదించుకుంటాడు. అదే గనిలో పనిచేసే ఒక రష్యన్ కార్మికుని పరిచయంతో కార్మికుల వుద్యమాలు, సోషలిజం లాంటి విషయాల మీద చర్చలు చేస్తూ తన అవగాహన పెంచుకుంటాడు. రానూ రానూ మరింతగా దిగజారిపోయిన కార్మికుల జీవితాలను ఈ నవలలో చూడొచ్చు. తెగించిన కార్మికులు వుద్యమ కార్యచరణకు పూనుకుంటారు. దీనికి ఎతైన్ని నాయకత్వం వహిస్తాడు. వుద్యమం చివరకు హింసాత్మకంగా మారి పోలీసుల అణచివేతతో అర్ధాంతరంగా ముగుస్తుంది. కుట్రతో ఎతైన్ని గని అడుగు భాగంలో యిరుక్కుపోయేట్టుగా చేస్తారు. నాటకీయంగా ఎతైన్ని ఎలా బయటికి వస్తాడో జోలా చాలా ప్రతిభావంతంగా వర్ణిస్తాడు. తరువాత ఎతైన్ని ఆ ప్రాంతాన్ని వదిలి పారిస్ వెళ్లిపోతాడు. కార్మికుల ఐక్యత, సంఘనిర్మాణం, నాయకత్వ లక్షణాలు, కార్మిక వ్యతిరేక శక్తులు,

బలహీనతలు మొదలయిన విషయాలు ఈ నవలలో చర్చకు వస్తాయి. జెర్మినల్ అనేది ఫ్రెంచ్ రివల్యూషనరి క్యాలెండర్ యొక్క వసంత కాలంలోని ఏడవ నెల. జెర్మినల్ అంటే ఫ్రెంచిలో విత్తనాన్ని నాటడం. ఆశ మొలకెత్తుతుంది. చిగురిస్తుంది... పెరిగి పెద్దదవుతుంది.. ఫలవంతమవుతుంది అన్న ఆశాభావంతో నవల ముగుస్తుంది. జోలా మరణించాక అతని అంత్యక్రియలకు హాజరయిన కార్మికులు "జెర్మినల్...జెర్మినల్" అంటూ నినాదాలుచేస్తూ జోలాకు నివాళి అర్పించారు. దీనిని బట్టి కార్మికులను, కార్మిక వుద్యమాలను ఈ నవల ఎంతగా ప్రభావితం చేసిందో మనకు తెలుస్తుంది.

గాలి వెలుతురు లేని చాలిచాలని గుడిసెలు, మరుగుదొడ్లు లేని కార్మిక మురికి వాడలు.. నీళ్ల యిక్కట్లు... తాగడానికి, వాడకానికి అవసరమైన నీళ్ళు లేక అధికారుల యిండ్ల దగ్గర నీళ్లు పట్టుకోడానికి వెళ్లితే కుండలు పగలగొట్టి తరిమేస్తే స్త్రీలందరు ఏకమై అధికారులని నిలదీస్తూ" మా మొగలేమొ, తల్లి కడుపులకు పెయినట్లు పుట్టెడు బండ కిందికి పోయి సచ్చిన సావెరుగక, బతికిన బతికెరుగక, నెత్తురు సెవుటజేసి, లారీలకు లారీలు, వాగిన్లకు వాగిన్లు బొగ్గు తవ్వి తీస్తుంటే గింత నెవరు లేదు... వెయిలకు వెయిలు పెట్టి మీకు... మీ పెండ్లాలకు ఆటలాడుకోను, ఈతకొట్టుకోను కట్టించుకోవచ్చుగని మాగుడిసెల్ల గీవాలుగు మంచినీళ్ల పంపులు వెట్టితే మీ సొమ్మంత ఒడుత్తాదుర్లు..." రక్తం, చెమటలు చిందిస్తూ, ప్రమాదపు అంచులలో బతుకుతూ ఖనిజాలను తవ్వి సమాజానికి అందిస్తున్న కార్మికులకు కనీస అవసరాలు కల్పించని యాజమాన్యాలకు వ్యతిరేకంగా స్త్రీలు పోరాటం చేసి తమ వాడలల్లో నీటి వసతిని కల్పించుకున్న స్త్రీల పోరాట కథ తుమ్మేటి రఘోత్తమరెడ్డి గారి "నీళ్ల తగువు".

సిటడెల్ **(Citadel)** నవల వ్రాసిన డా.ఎ.జె. క్రొనిన్ స్వయంగా డాక్టర్. బొగ్గు గనులలో వెలువడే దుమ్ము. దూళి లను పీల్చడం వలన ఊపిరితిత్తుల మీద ప్రభావం, దాని వలన వచ్చే వ్యాధులకు సంబంధించిన అంశంపై పరిశోధన చేశారు. సరి అయిన వైద్య పట్టా లేకుండానే బొగ్గుగని ప్రాంతంలో వైద్యం చేసే మోసకార్లను ఈ నవలలో ఎండగట్టారు క్రొనిన్. అశుభ్రంగా, దుర్గంధబరితంగా వున్న గని పరిసర ప్రాంతాలను చూసి ఆవేదన పొంది దాన్ని మార్చడానికి ప్రయత్నం చేసిన ఒక యువ డాక్టర్ జీవితమే ఈ నవల. ఒక ఇంటర్వ్యూలో ఈ నవల గురించి మాట్లాడుతూ" నా కళ్ళతో చూసినది, నా అనుభవం నుండి వ్రాసిన నవల యిది. వ్యక్తిగతంగా ఈ నవల ఎవరి మీద దాడి కాదు... ఈ వ్యవస్థ మీదనే దాడి" అని చెప్పారు.

ఓబుళాపురం ప్రాంతంలో తవ్వి వెలికి తీసే ఇనుప ఖనిజాన్ని నెల్లూరు జిల్లాలో నెలకొల్పిన కృష్ణపట్నం ఓడరేవు నుండి ఇతర దేశాలకు ఎగుమతి చేసేవారు. ఇనుప ఖనిజాన్ని లారీలలో నింపి రవాణా చేసే సమయాల్లో, మట్టి రూపంలో వున్న ఇనుప ఖనిజ రవ్వలు ఆ దారుల వెంట గాలిలో కలిసి ప్రజలకు కల్పించే ఇబ్బందులు గురించి నల్లూరి రుక్మిణి రాసిన" క్వీన్ విక్టోరియా మళ్లీ నవ్వింది" అనే కథలో చిత్రించారు. దుమ్ము కంట్లో పడి కళ్ల జబ్బు తెచుకున్న దేవరాజుతో డాక్టర్" కంటి పొరల నిండ పస్ చేరింది. ఆ దుమ్ము నిండా ఇనుప రజనే గదా. ఇన్ఫెక్షన్ వస్తుందని తెలియదా? మీ ఊళ్లో నుండి తరచుగా ఇట్లాంటి కేసులు వస్తూనే వున్నాయి. కళ్లకే కాదు, ఊపిరితిత్తులకు కూడా ప్రమాదమే..." అనే విషయంతో పాటు వేగంగా ప్రయాణించే లారీలు, ట్రక్కులు చేసే యాక్సిడెంట్లు గురించి మాట్లాడుతూ" భవిష్యత్తు తరాల కోసం భద్రపరచవలసిన ఖనిజాలూ...ముడిసరుకులు విదేశాలకు అమ్ముకోవడం జాతిద్రోహం కాదూ" అన్న వ్యాఖ్యానంతో మానవ అవసరాల కోసం, సమాజ అభివృద్ధి కోసం వుపయోగించవలసిన ఖనిజాలను కొంతమంది వ్యక్తుల పరం చేసిన ప్రభుత్వ విధానాన్ని, అక్రమంగా తవ్వుకుంటూ లాభాలను పోగేసుకుంటున్న పెట్టుబడిదారులను ఎండగట్టినట్టయ్యింది. వి.ప్రతిమ రాసిన చావుదారులు" కథ కూడా ఓబులపురం గనుల నుండి కృష్ణపట్నం ఓడరేవు వరకు ఇనుప ఖనిజాన్ని రవాణా చేసే లారీలు, ట్రక్కుల డ్రైవర్ల నిర్లక్ష్యం వలన జరిగే ప్రమాదాలకు సంబంధించినదే. లారీ డ్రైవర్ల నిర్లక్ష్యంతో రాజమ్మ బిడ్డలు రోడ్డు ప్రమాదంలో చనిపోతాయి. వాటి మీదే బతికే రాజమ్మ బతుకు అగమ్య గోచరంగా మారుతుంది. రోడ్డు మీద తిరిగే వాళ్ళెవ్వరికి యివ్వాళ ప్రాణం హామీ అంటూ లేదు.. బతికి పోయిన వాళ్లకి ఆరోగ్యహామీ వుండదు అని వేదన పడుతుంది దేవసేన. రాజమ్మకు అండగా నిలిచిన దేవసేన తమ్ముడు పద్మ హేమంత్‌ను పోలీసులు అరెస్టు చేస్తారు. వాళ్లు పెట్టిన చిత్రహింసలో హేమంత్ కాళ్లు పోగొట్టుకుంటాడు. అమెరికా సబ్ ప్రైమ్ సంక్షోభం మూలంగా చైనా ఇనుపఖనిజాన్ని దిగుమతి చేసుకోవడం ఆపేస్తుంది. నిశ్శబ్దంగా మారిన దారులను చూస్తూ యిది తాత్కాలిక విరామమే శాశ్వతం కాదు అని తెలుసుకొని, ప్రజలను చైతన్యవంతులను చేయడానికి స్నేహితులతో చర్చించే హేమంత్ ను గుర్తు చేసుకుంటూ భవిష్యత్తు మీద నమ్మకంతో ముందుకు కదులుతుంది దేవసేన. ప్రజలను విస్మరించి లాభాలను పోగేసుకుంటున్న పెట్టుబడిదారులను ఎదుర్కొనడానికి ప్రజలు సన్నద్ధం కావాల్సిందే అన్న సందేశంతో వచ్చినవి ఈ రెండు కథలు.

యూరేనియం, బాక్సైట్ గనుల తవ్వకాల మీద కథ, కవిత్వం, నవల కంటే కూడా ఎక్కువగా వ్యాసాలు వచ్చాయి, యూరేనియం, బాక్సైట్ ఖనిజాలను తవ్వే క్రమంలో వెలువడే విషపదార్థాలు ప్రజల ఆరోగ్యం, చుట్టుపక్కల జలాశయాలు, ప్రకృతి, పర్యావరణాల మీద ఎలాంటి ప్రభావం చూపుతాయో తమ వ్యాసాలల్లో

**భవిష్యత్తు తరాల కోసం భద్రపరచవలసిన ఖనిజాలూ...ముడిసరుకులు విదేశాలకు అమ్ముకోవడం జాతిద్రోహం కాదూ" అన్న వ్యాఖ్యానంతో మానవ అవసరాల కోసం, సమాజ అభివృద్ధి కోసం వుపయోగించవలసిన ఖనిజాలను కొంతమంది వ్యక్తుల పరం చేసిన ప్రభుత్వ విధానాన్ని, అక్రమంగా తవ్వుకుంటూ లాభాలను పోగేసుకుంటున్న పెట్టుబడిదారులను ఎండగట్టినట్టయ్యింది.**

## కవిత

# భారాలు

- తగరం కృష్ణయ్య
9440578404



ఉచితాలు
ఓ మోస్తరు గాలి మరల లాగే
తిరిగినంత తిరుగుతాయి
తర్వాత కోతలు - వాతలు మామూలే !

పాడు కరెంటు
ఎప్పుడు తీస్తాడో !
ఎప్పుడు ఇస్తాడో !
చెప్పి చావడూ...
పిల్లి శాపనార్థలకు ఉట్లు
తెగతాయా..
బిల్లులు ఎన్నో !
అన్ని బిల్లులూ జేబు కు చిల్లులే
విద్యుత్ బిల్లు మాత్రం గుండెకే చిల్లు

అమ్మా ! కరెంట్ బిల్లు
నాన్నకు చూపకు
నాడి వాడుతుంది
గుండె ఆగుతుంది

ఈకూతలు
కోతలు -వాతలకే
ఏ కూతలో చెప్పండి
ఉచిత విద్యుత్ కూతలు
నవ్వి పోదురు గాక నాకేంటి
నిజాలు చెప్పద్దు.
అర్ధరాత్రి ఎలా ! పోవాలి నాన్న
అసలే అమావాస్య

ఏ గట్టుచాటున సివంగులైనా
ఉంటాయి
నేను పోను నాన్నా ! పొలానికి
కరెంట్ చావుకంటె
సివంగి చావే మేలు రా కన్నా !

గుండె పగులుతుంది
మోటర్ తిరిగనందుకు కాదు
మీటర్ తిగినందుకు
బిల్లు పెరిగినందుకు
అన్ని బల్బులు ఆర్పేయిరా ! చిన్నా !

ఒక యూనిట్ తగ్గినా స్లాబ్ మారుతుంది
బిల్లు తగ్గుతుంది
ఈ చీకటి ఎవరి పాపం.

నాయకులు నీటి మూటలు
ఎండుతున్న పంటలు
మండుతున్న బిల్లులు
మోయలేని భారాలు
ఇంకా ఎంతమంది
కరెంట్ తీగల శవాలు
2014 ఎంత వరకో
అంతవరకు
పైసా పెంచం
అచ్చంగా ఆంబోతు లా
రంకేలేచి చెప్పినా
ప్రజల నడ్డినెక్కి
మేటనొక్కారు
కోతలు - మోతలు
ఒకసారే నంటూ
వాతలు పెట్టారు

ప్రజల నాడి తెలుసు మీకు
వేడితెలియాలి
లాటీలుకు - తూటాలకు
ఎదురొడ్డి నిలిచే
దమ్ము పొగరు తెలియాలి

---

చర్చించారు. ఈ అంశాల మీద కాల్పనిక సాహిత్యం రాకపోవటం పెద్ద లోటుగా కనిపిస్తుంది.

ఖనిజ సంపద విరివిగా దొరికే ప్రాంతాలపై బహుళ జాతి కంపెనీలు రాబందులుగా వాలి ప్రజలను పీక్కుతింటున్నాయి. శ్రమజీవుల రక్తం, చెమట తడిసిన ఖనిజాలను తవ్వుకొని ఇబ్బడి ముబ్బడిగా లాభాలు సంపాదించుకుంటున్నారు. కార్మికుల కనీస హక్కులను కాలరాచి వారి ప్రాణాలతో చెలగాటమాడుతున్నారు. స్థానికంగా వున్న రాజకీయనాయకులు, ప్రభుత్వాధికారులు, పెట్టుబడిదారులు ఈ బహుళజాతి కంపెని పెట్టుబడిదారులతో చేతులు కలిపి సమాజంలో అందరికి దక్కవలసిన ఫలితాలను తామొక్కరే దక్కించుకుంటున్నారు. బహుశా యిలాంటి వారిని చూసే ప్లాబ్లో నెరుడా ఒక కవితలో యిలా అంటారు. **"American Inferno, our bread/ soaked in poison. There's another/ tongue perfidious fire: /the native lawyer of the foreign company"**. ఖనిజాలు దొరికే ప్రాంతాలు అభివృద్ధి చేయకుండా, స్థానిక ప్రజల అవసరాలు తీర్చకుండా, వారిని నిర్బంధాలకు గురిచేస్తూ, ఆ ప్రాంతాల నుండి వాళ్లను తరిమివేస్తూ పెట్టుబడిదారుల కొమ్ము కాస్తున్న ప్రభుత్వాలను నిలదీసే చైతన్యం ప్రపంచ వ్యాప్తంగా రావాలి. దీనికి సాహిత్య రూపం తీసుకురావటానికి రచయితలు క్షేత్ర పర్యటనలు చేస్తూ అందులోని లోతు పాతులను అధ్యయనం చేయవలసిన అవసరం వుందన్న నెరుడా మాటలను ప్రతి రచయిత స్ఫూర్తిగా తీసుకోవాలి.



కవిత

# ఎటువైపు మన పయనం....!

టి. సురేంద్ర

ఆకాశమంత ఎత్తు ఎగిరి రాకెట్‌ను కనుగొన్నా...
అమ్మ ప్రేమను కోల్పోతున్నాం !

భారానికి మించిన ఆస్తులు సంపాదించిన
బాల్య స్నేహితులకు దూరం అవుతున్నం

విదేశీ ప్రయాణాలు అన్ని చేస్తున్నాం.. గాని
మన సొంత ఊరిని సొంత ఇల్లును చూసే తీరిక
లేకుండా వున్నాం !

వెలుగెత్తి చాటాల్సిన మన సాంప్రదాయాల్ని
చీడపురుగుల్లా చూస్తు పాశ్చాత్య సంస్కృతి
నీడలో వుంటున్నాం !

ముక్కు ముఖం తెలియని వాళ్ళతో (ఫేస్‌బుక్)
సంబంధాలను పెంచుకుంటున్నాం గాని
ఆప్యాయంగా పలకరించే అమ్మమ్మ, నానమ్మల
ప్రేమను కోల్పోతున్నాం !

గుర్రాల్లా పరుగెత్తాలనుకున్న మన ఆశలకు
మనమే సంపద అనే కళ్ళేన్ని వేసుకుంటున్నాం !

స్వాతంత్ర్య దేశంలో ఉంటూ కూడా స్వతంత్ర్యంగా
ఆలోచించలేమనీ కాన్సెప్ట్ స్కూల్‌లలో బంధీగా వుంటున్నాం !
ప్రకృతి ఒడిలో పసిపిల్లలాగ పెరగాల్సిన మనం
హైబ్రీడ్ మోజులో అనారోగ్యాలకు గురవుతున్నాం !
నూరేళ్ళు బ్రతకాల్సిన మనం ఆరుపదులు నిండకముందే
మరణమృదంగం వింటున్నాం యంత్రాల రణ గొణ ధ్వనుల్లో !
మనదేశ భరతమాతగ, సరస్వతిగా, లక్ష్మిగా పూజించే
ఆడపిల్లలపై దారుణాలకు పాల్పదుతున్నాం కామాంధులమై !
అడవితల్లి ఒడిలో పెరిగే అందమైన జీవులను కూడా
మానవ రాక్షస రూపంలో వెంటాడి వేటాడి బక్షిస్తున్నాం !
ఉన్నత స్థితిలో వున్నాం అని నిరూపించుకోవడం కోసం
మన మాతృభాషను కూడా మరిచిపోతున్నాం పరభాష మోజులో...!
వెలుగెత్తి చాటాల్సిన దేశాన్ని వదిలి పరాయిదేశంలో బానిసలుగా
బ్రతుకుతున్నాం !
చేయూత నివ్వాల్సిన ముసలివాళ్ళను నడిరోడ్డు మీద వదిలేస్తున్నాం
మసకబారిన కళ్ళతో !
అనుకున్నది సాధించలేకపోతే ఆత్మహత్యలు చేసుకునేంత



పిరికివాళ్ళుగ బ్రతుకుతున్నాం కాని పైపైకి గొప్పలు చెబుతాం
!
మానవత్వం అన్నదాన్ని ఎప్పుడో మరచిపోయాం
అహంకారం అన్న ముసుగులో....
అమ్మ ప్రేమకు అర్థాన్ని మార్చేస్తున్నాం పాపం, పుణ్యం
తెలియని
చిన్న చిన్న ఆడపిల్లల గొంతు నులిమి !
ఎప్పుడో మరిచిపోయాం అమ్మచేతి గోరుముద్దలను
ధూమపానం మత్తుపదార్థాల మోజులో....!
కాలాన్ని వెళ్ళదీస్తున్నామో, జీవితాన్ని గడుపుతున్నామో
అర్థంగాని స్థితిలో వున్నాం ఈ కలియుగంలో....!
ఎటువైపు మన పయణం అన్నది అర్థంగానీ ఆ
గమ్యగోచరంగా మారింది.
గమ్యం లేని ప్రయాణం చీకటిలో సంధించిన
బాణంలాంటిదని
తెలుసుగా ఇంకెందుకు ఆలస్యం మేలుకో... ఓ మిత్రమా !

ఇంటర్వ్యూ

## జ్ఞానపీఠ పురస్కార విజేత డా॥ రావూరి భరద్వాజ

# సమాజానికి నమస్కరిస్తున్నా!



ఇంటర్వ్యూ:

**రెంటాల జయదేవ**

**భారతీయ సాహిత్యంలోని అత్యున్నత పురస్కారం 'జ్ఞానపీఠ్' మీకు దక్కినందుకు ముందుగా అభినందనలు. ఈ పురస్కారం దక్కడానికి ప్రధాన కారణం ఏమనుకుంటున్నారు?**

ఈ అరుదైన గౌరవం దక్కడానికి నేను మాత్రమే కారణం అనుకోవడం లేదు. నా జీవితానుభవాలు ఆ అనుభవాలు ప్రసాదించిన సామాజిక వాతావరణం, ఆ వాతావరణంలోని మనుషులు, దాన్ని మలిచిన పెద్దలు, రాజకీయ నాయకులు అందరూ కారణం. ఈ సమాజం ప్రసాదించిన గొప్ప అనుభవాలకు నేను చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

**ఈ విషయం మీకు ఎప్పుడు తెలిసింది?**

ఈ రోజు(17.04.2013) మధ్యాహ్నం 12.30-ఒంటిగంట సమయంలో విశాఖపట్నం నుంచి ఒకరు నాకు ఫోన్ చేసి చెప్పారు. ఇంతలో ఢిల్లీ నుంచి 'భారతీయ జ్ఞానపీఠ్' వారు కూడా తెలిపారు.

**'జ్ఞానపీఠ్' లభిస్తుందని మీరు ఎన్నడైనా ఊహించారా?**

(నవ్వేస్తూ...) లేనే లేదు. ఎన్నడూ కల కూడా కనలేదు.. జ్ఞానపీఠం కోసం ప్రయత్నించనూ లేదు. అన్నం తిన్నట్టు కల వచ్చింది కానీ, పంచభక్ష్య పరమాన్నాలతో, బంగారు పళ్ళెంలో, రత్నాలు పొదిగిన చెమ్చాతో తింటానని కలగన లేదు. సాహిత్యపరంగా అటువంటి ఉన్నతోన్నతమైనది ఈ అవార్డు. ఇది వస్తే బాగుండునని అనుకోవడం వేరు. రావడం వేరు. మూడు, నాలుగు పర్యాయాలుగా దరఖాస్తుయితే చేశాను. పంపించి, ఓ ప్రయత్నం చేశాను కానీ వస్తుందని అనుకోలేదు.

**ఊహించని అవార్డు వచ్చిన ఈ క్షణంలో మీ అంతరంగ భావన?**

నేను ఎంతో ఆనందంతో ఉన్నాను. సంతోషాన్ని మించిన స్థాయి ఆనందం. కలలో కూడా ఊహించని సుందరాంగులు, విద్యా సంపన్నులు, సంస్కారసంపన్నులు ముందుకు వస్తే ఎలా ఉంటుందో అలా అనిపించింది. ఈ అవార్డు నేను కలలు కన్నది కాదు. నిజానికి నా జీవితంలో నేను పిడికెడు మెతుకుల కోసం పాకులాడానే తప్ప, అవార్డుల కోసం ఎన్నడూ పాకులాడ లేదు. వాటి కోసం ఎవరినీ యాచించలేదు, అర్థించలేదు. అభ్యర్థించలేదు.

**మీరు చాలా ఏళ్ళ క్రితం రాసిన 'పాకుడు రాళ్ళు' నవలా రచన నేపథ్యం పాఠకులకు వివరిస్తారా?**

నేను దాదాపు మూడున్నరేళ్ళు మద్రాసులో ఉన్నాను. ఆ రోజుల్లో రచయిత ధనికొండ హనుమంతరావు నడుపుతూ, సన్నిహితుడైన కొలను బ్రహ్మానందరావును ఎడిటర్‌గా ఉంచిన 'చిత్రసీమ' అనే సినీ పత్రికలో పనిచేశాను. అప్పట్లో మద్రాసులో కోడంబాకమ్ ప్రాంతంలో ఈస్ట్ ఎవెన్యూ రోడ్డులో ఉండేవాణ్ణి. సాయంత్రమైతే రచయితలు, మిత్రులు అందరం పాన్‌గల్ పార్కు దగ్గరకు చేరేవాళ్ళం. నేను తెనాలి నుంచి మద్రాసు వెళ్ళి పోతున్నప్పుడు నా మిత్రుడు ఒకరు నాకు ఓ డైరీ ఇచ్చాడు. ఆ డైరీలో నా దినచర్య, రోజువారీ అనుభవాలు రాసుకొనేవాణ్ణి సినిమా పత్రికలో పనిచేస్తూ, పలువురు తారలను దగ్గర నుంచి చూస్తూ, వారితో ఇంటర్వ్యూలు చేశాను. అలా సినిమా ప్రపంచాన్నీ, మనుషులనూ దగ్గర నుంచి చూస్తూ, డైరీలో రాసుకున్న అనుభవాలు, జ్ఞాపకాలతో కథ ఎందుకు రాయకూడదని నాకు అనిపించింది. అలా

నేను ఓ కథ రాశాను.

**మరి, అది నవలగా ఎలా మారింది?**

ఆ కథను సాహితీ దిగ్గజం మల్లంపల్లి సోమశేఖర శర్మ గారికి చూపించాను. ఆయన అంతా చదివాక, 'బాగుంది కానీ, పది మందిని కూర్చోబెట్టాల్సిన చోట వంద మందిని కూర్చోబెట్టావేమిటి?' అన్నారు. నా మట్టిబుర్రకు మొదట వెలగలేదు. వివరం అడిగితే, 'ఇది మూడు, నాలుగు వందల పేజీల నవలగా సరిపడే అంశాన్ని ఒక కథగా రాశావు' అన్నారు. ఆ మాట నా మనస్సులో ఉండిపోయింది. ఆ తరువాత హైదరాబాద్ వచ్చాక, అప్పటి 'కృష్ణాపత్రిక' అధిపతి ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు నన్ను ఏదైనా రాయమని అడిగారు. నేను ఈ కథాంశాన్ని దృష్టిలో పెట్టుకొని, సినిమా వాళ్ళ మీద సీరియల్ రాస్తాను అన్నాను. వాళ్ళ మీద రాయడానికి ఏముంటుందన్నారాయన. చాలా ఉందని చెప్పి, మద్రాసులో సినీ రంగంలో నాకు కలిగిన అనుభవాల ప్రాతిపదికన ముందుగా 12 వారాలకు సరిపడా భాగాలు భాగాలుగా సీరియల్ రాసి, తీసుకువెళ్ళాను. అది నచ్చి, 'కృష్ణాపత్రిక' ధారావాహికగా ప్రచురించారు. ముందుగా 30-40 పేజీల కథగా అనుకున్నది. చివరకు మూడు నాలుగేళ్ళు పెద్ద సీరియల్‌గా వచ్చింది. ఆ నవలకు విశేష ఆదరణ లభించింది. అసలు ఆ నవలకు ముందు నేను అనుకున్న పేరు 'మాయ జలతారు' అని. కానీ, అప్పట్లో 'కృష్ణా పత్రిక'లో పని చేస్తున్న సాహితీ మిత్రుడు, చిత్రకారుడు శీలా వీర్రాజు దానికి 'పాకుడు రాళ్ళు' అని నామకరణం చేశారు. పాచిపట్టి, జారిపడతామని తెలిసినా అందరూ సినీ రంగం వైపు ఆకర్షితులవుతుంటారు... జారి పడుతుంటారు... దెబ్బలు తగిలించుకుంటారు... మళ్ళీ మళ్ళీ దాని మీదే వెళుతుంటారు... అనే విశాలమైన అర్థంతో ఆయన పెట్టిన పేరు అది. ఆ నవల తమిళ, కన్నడ భాషల్లోకి కూడా అనువాదమైంది. అక్కడా అందరి ఆదరణ పొందింది. ఆ నవలను ఆకాశవాణి వారు ఓ గంట వ్యవధితో నడిచే శ్రవ్య నాటకంగా మలిచారు. ఆ నవలపై సిద్ధాంత వ్యాసాలూ వచ్చాయి.



**'పాకుడురాళ్ళు'తో సహా మీరు చేసిన రచనల్లో వాస్తవమెంత? కల్పన ఎంత?**

రచన అంటేనే అందులో కల్పన, వాస్తవం కలగలిసి ఉంటాయి. వాస్తవానికి, కొంత కల్పన జోడిస్తాం. అలాగే, కల్పన ప్రాతిపదికగా వాస్తవం ఉంటుంది. దాన్ని ఒకే ఒక్క దృక్కోణంతో చూడడం సాధ్యం కాదు.

**ఆ నవలను ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే మీకు ఏమనిపిస్తుంది?**

ఇవాళ్టికీ ఆ నవలలోని ఏ పేజీ చూసినా, అందులోని పాత్రకు నాకు ప్రేరణగా నిలిచిన నిజజీవిత నటీనటులు, వారి స్వభావాలు, ఆ సంఘటనలు గుర్తుకు వస్తాయి. అయితే, ఆ వ్యక్తుల పేర్లు నేను చెప్పడం బాగుండదు.

**ఆ నవల అంతటి ఆదరణ పొందడానికి కారణం ఏమిటంటారు?**

మనం చెబుతున్నది నిజమైనప్పుడు... నిజాన్ని నిజంగా చెబుతున్నప్పుడు.. అవతలి వాళ్ళను నొప్పించకుండానే నిజాయితీగా చెబుతున్నప్పుడు ఏ రచనకైనా ఎంతో పేరు వస్తుంది. అది అందరి ఆదరణా పొందుతుంది. 'పాకుడు రాళ్ళు'లో ఉన్నవన్నీ నిజాలు... నిజాయతీగా చెప్పిన నిజాలు. ఇప్పటికే ఆ నవల మూడు, నాలుగు సార్లకు పైగా ముద్రణకు నోచుకోవడమే అందుకు నిదర్శనం.

**'పాకుడురాళ్ళు' నవలలోని మంజరి పాత్రకూ, మహానటి సావిత్రి జీవితానికీ చాలా పోలికలు ఉన్నాయనీ, అందులోని కొన్ని ఘట్టాలు ఆమె జీవితంలో జరిగినవే నని సాహితీ లోకంలో ఓ మాట ప్రచారంలో ఉంది. దానికి మీరేమంటారు?**

ఆ మాట చాలా వరకు నిజమే! నటి సావిత్రి తరచుగా మా ఇంటికి వస్తుండేది. నన్ను 'బావ' అనీ, మా ఆవిడను 'పిన్ని' అనీ పిలిచేది. 'అవేమి వరసలే! నన్ను బావ అని పిలిస్తే, మా ఆవిడను అక్కా అని పిలువు! ఆమెను పిన్ని అని పిలిస్తే, నన్ను బాబాయ్ అని పిలువు' అన్నాను. అందుకు సావిత్రి సరదాగా 'సినిమా వాళ్ళకు వరసలేమిటి బావా!' అని నవ్వేసింది.

**సినీ జగత్తులోని వ్యక్తుల అంతరాంతరాలను ప్రతిభావంతంగా బొమ్మ కట్టించారు. ఆ వ్యక్తుల పేర్లు బయటకు వస్తే...**

సినీ జగత్తు ఓ చిత్రమైన ప్రపంచం. అక్కడ తండ్రీ కొడుకులిద్దరితో దోస్తీ కట్టిన నటీమణులతో సహా చాలామంది చాలా వ్యవహారాలు నాకు తెలుసు. డైరీల్లో 'నా అనుభవాలన్నీ రాసుకున్నాను. అవన్నీ పేర్లతో సహా బయటకు రావాలంటే, నేను చనిపోయాక, నా డైరీలు బయటపెట్టాలి. 'పాకుడు రాళ్ళు' లాంటి సినీ రంగంతో సన్నిహితంగా ఉంటూ కూడా జారకుండా జాగ్రత్త పడిన వాళ్ళలో ప్రముఖ రచయిత కొడవటిగంటి కుటుంబరావు, నేను – ఇలా కొంతమంది ఉన్నాం.

**మీ రచనల ఆధారంగా సినిమాలు రాలేదా?**

నేనూ ఒకటీ ఆరా సినిమాలకు పనిచేశాను. వాటి పేర్లు ఇప్పుడు వద్దులెండి! ప్రముఖ నిర్మాత 'సహజకవి' ఎం.ఎస్. రెడ్డి గారు 'కరిమింగిన వెలగపండు' అనే నా కథ ఆధారంగా 'ఓ ప్రేమ కథ' అనే సినిమా తీశారు.

**మీరు వందల సంఖ్యలో కథలు, పదుల సంఖ్యలో నవలలు, నాటకాలు, వ్యాసాలు, పిల్లల కథలు రాశారు. మీ రచనల్లో మీకు బాగా నచ్చినదంటే ఏం చెబుతారు?**

మీ కన్నబిడ్డల్లో ఏ బిడ్డ ఇష్టమంటే ఏం చెబుతాం? 'పాకుదురాళ్ళు', 'జీవన సమరం' గాథలు, 'కాదంబరి' నవల, 'కరి మింగిన వెలగపండు' నాకు ఇష్టమైనవి. ఈ నా రచనల్లోనూ నాకు మరింత బాగా నచ్చింది – 'జీవన సమరం'. సమాజంలోని వివిధ జీవన రంగాల్లోని సామాన్య వ్యక్తులను స్వయంగా కలిసి, ఇంటర్వ్యూలు రికార్డు చేసి, వారి మాటలో, వారి యాసలో రాసిన వాక్చిత్రాలు అవి. అందులో కత్తులు సానబట్టేవాడు, చెవిలో గుబిలి తీసేవాడు, సోది చెప్పే అమ్మి, చిలక జోస్యగాడు.. ఇలా సమస్త శ్రామిక జీవుల జీవితాలు, వారి జీవన గమనాలు వారి మాటల్లోనే అక్షరబద్ధం చేశాను. 'ఈనాడు' దినపత్రిక అధినేత రామోజీరావు ప్రోద్బలంతో, దాదాపు 50 – 60 వారాలు ఆ సిరీస్ రాశాను. సామాన్య వ్యక్తులు బతకడం కోసం చేసిన సమరమైన 'జీవన సమరం'లో బడుగు జీవులు, మధ్యతరగతి వారు.. ప్రతి ఒక్కరూ కనపడతారు.

**అయితే, మీరు జీవితంలో చేసిన పనులు, రాసిన రచనలు అన్నీ ఇలా చిత్తశుద్ధితో నమ్మి, నిజాయతీగా చేసినవేనంటారు! ఇవాళ్టి రచయితలు చిత్తశుద్ధితో రాయాలంటారు !**

(సాలోచనగా...) అలా చెప్పలేను. చిత్తశుద్ధిగా నమ్మని పనులు కూడా బతకడం కోసం నేను ఎన్నో చేశాను. ఉద్యోగ రీత్యా నా యజమానులు, నా పై అధికారులు కోరినవి, చెప్పినవి కూడా రాశాను. వృత్తి రీత్యా కానివ్వండి... డబ్బు కోసం కానివ్వండి... బతకడం కోసం అనుకోండి.. నేనూ కొన్ని రాయాల్సి వచ్చింది. రచనల ప్రింటులో అనుకున్నంత రాలేదని ప్రచురణకర్త చెప్పినప్పుడు, రూపాయికి పేజీ వంతున రాసిన ఘట్టాలూ ఉన్నాయి. నాకు ఇష్టం లేని పనులు కూడా ఇష్టమున్నట్లు నటిస్తూ చేయడం కూడా అప్పుడప్పుడు తప్పలేదు. కాబట్టి, ఆ మాట చెప్పే హక్కు నాకు లేదు.

**వాస్తవ జీవితంలోని ఘటనలతోనే కాక, సైన్స్ ఫిక్షన్ లాంటివీ చేసినట్లున్నారు!**

అంతరిక్ష ప్రయాణం ఇంకా తెలియని రోజుల్లో 1950 – 52 ప్రాంతంలో 'చిత్ర గ్రహం' అంటూ స్పేస్ ట్రావెల్ మీద 'ఆంధ్రప్రభ'లో సీరియల్‌గా రాశాను. అలాగే, 'జలప్రళయం' అంటూ మరో పాపులర్ సైన్స్ రచనల కూడా చేశాను.

**మీ శ్రీమతి మీద స్మృతి రచనలు చేశారు కదా! ఆమె మీ జీవితంలో పోషించిన పాత్ర గురించి...**

నా కోసం ఆమె ఎన్నో కష్టాలు పడింది. (గొంతు జీరపోతుండగా...) నగలు కూడా అమ్మేసి, పసుపుతాడుతో బతికింది. నా పురోగమనం వెనుక ఆమె పాత్ర ఎంతో ఉంది. దురదృష్టవశాత్తూ, ఆమెను త్వరగానే కోల్పోయాను. ఆమె స్మృతిగా రాసినవే 'నాలోని నీవు', 'అంతరంగిణి', 'ఐతరేయం', 'అయినా ఒక ఏకాంతం', 'ఒకింత వేకువ కోసం!' ఈ అయిదూ ఆమెకు స్మృత్యంజలిగా నా మనసులోని భావాలు. కథలు రాస్తున్నప్పుడు కూడా నా భార్య, ఆమె జ్ఞాపకాలు చిక్కగా, ఆత్మీయంగా ఉంటాయి గనక నాకు జ్ఞాపకం వచ్చినవి, నేను చూసినవీ కూడా వాటిలో రాశాను.

**రచనలు చేయడానికి మీకు ప్రధానమైన ప్రేరణ... కారణం?**

ఆసక్తి (భుక్తి గడవాల్సిన) అవసరం, (జీవితంలో పేరుకుపోయిన) అసంతృప్తి! ఇవే నన్ను రచనలకు ప్రేరేపించాయి. అంతే తప్ప నేను కేవలం ఆశయం కోసం రాశానని చెబితే అది అబద్ధం. ఇందాకే చెప్పినట్లు పేజీకి రూపాయి చొప్పున ఇస్తామంటే రాసిన సందర్భాలూ ఉన్నాయి. నేను జీవితంలో, సమాజంలో ఎన్నో కష్టాలు, బాధలు పడ్డాను. నా బాధలను సమాజానికి అంటించిన సందర్భాలూ ఉన్నాయి.

**మీకు ప్రేరణనిచ్చిన మీ సన్నిహిత రచయితలు, సాహితీ ప్రముఖులు?**

కొడవటిగంటి కుటుంబరావు, చలం, మునిమాణిక్యం, గోపీచంద్, ధనికొండ హనుమంతరావు వీళ్ళందరి రచనలూ నాకు ప్రేరణ. పరోక్షంగా వారిచ్చిన ప్రోత్సాహం. ప్రముఖ రచయితలు కొడవటిగంటి కుటుంబరావు, ధనికొండ హనుమంతరావు, శారద తదితరులు. మేమంతా కలిసి మెలిసి తిరిగాం. కలిసి దరిద్రాలు, బాధలు, కన్నీళ్ళు అనుభవించాం.

**మరి, మీరు వ్యక్తిగతంగా ఇష్టపడే రచయితలు?**

రచయితల్లో చలం, గోపీచంద్, కవుల్లో 'కళాపూర్ణోదయ' కర్త పింగళి సూరన, పఠాభి, తదితరులు.

**కథ, నవల, నాటకం, వ్యాసం, బాలసాహిత్యం, శ్రవ్య రూపకం... ఇలా ఎన్నో సాహితీ ప్రక్రియల్లో మీకు అభినివేశం ఉంది. వీటిలో ఏ ప్రక్రియ కష్టమైనదంటారు?**

నా అభిమానులు చాలా మందికి నేను రాసిన చిన్న కథలంటే చాలా ఇష్టం. అలా రాయడం చాలా కష్టమని కూడా అంటారు. కానీ, నా దృష్టిలో రేడియోకు రూపకం రాయడం ఎంతో కష్టం. చాలా క్లిష్టమైన రచనా ప్రక్రియ అది. అందులోనూ ఆకాశవాణి వారి నిబంధనలకు తగ్గట్టుగా, వారికి నచ్చేలా రాయడం మరీ కష్టం.

**ఆకాశవాణిలో ఉద్యోగానికి మీ జీవితంలో ఎలాంటి పాత్ర ఉంది?**

(ఉద్వేగానికి గురవుతూ...) కడుపు నిండా తినడానికి పట్టెడన్నం కోసం కష్టపడిన రోజులు నా జీవితంలో ఎన్నోఉన్నాయి. అలాంటి నేను, నా భార్య, నా బిడ్డలు కడుపు నిండా ఇంత తినడానికి జీతభత్యాలతో కూడిన ఉద్యోగమిచ్చిన సంస్థ – ఆకాశవాణి. అప్పట్లో 185 రూపాయల జీతమంటే చాలా ఎక్కువ. హైదరాబాద్ ఆకాశవాణిలో నాకు ఉద్యోగంరావడానికి కారణమైన రచయిత త్రిపురనేని గోపీచంద్‌ను మర్చిపోలేను. నాకు ఎన్నో పుస్తకాలు చదువుకొనే అవకాశం, ఆలోచించే తీరిక, రాసే అవకాశం ఇచ్చింది ఆకాశవాణే. నాకున్న పరిధిని విస్తృతీకరించిన మహోన్నత కళాసంస్థ అది. ఆ జీవితాన్ని, నేను ఎన్నడూ మర్చిపోలేను. (గొంతు గద్గదికం అవుతుండగా...) నాకు ఒకే ఒక్క కోరిక ఉంది. అది తీరుతుందో లేదో కానీ... నేనుచనిపోయాక, నా పార్థివశరీరాన్ని ఆకాశవాణి ప్రాంగణంలో

# పల్లె పోరు పతాకాలు

- ఎస్. బాల సుధాకర్ మౌళి
9676493680

జానెడు ఆకలి పొట్ట కోసం -
పొద్దస్తమానం
పనిలో రెక్కలు ముక్కలుచేసుకుంటే గానీ
రాలని పదో, పరకతోనో
ఇంటికి చేరే 'శ్రామిక గువ్వ'లపై
ఏ చీకటి కళ్లు
పడుతున్నాయో..
నెత్తుటి నాళాలలో రేగిన తుఫాను దెబ్బకు
తెల్లారేసరికి
'పచ్చని గువ్వల గూళ్లు'
దుఃఖ సముద్రాలలో మునిగిపోతున్నాయి

'పల్లె పసుపు కుంకాల'పై
కత్తిగట్టిన మద్యం మాయావి
పచ్చని పల్లె లోగిళ్లలోకి చొరబడి
పూసిన పిడికెడు పేద స్వప్నాలను
నిర్దాక్షిణ్యంగా చిదిమేస్తుంటే..
వెలుగు దివ్వెలతో అలరాడాల్సిన
ఇంటి గుమ్మాలు
ఆరిన దీప శకలాలతో
కళావిహీనమౌతూ..
గువ్వా గువ్వా కలిసి
పుల్లా పుల్లా ఏరుకుని



నింగి నీలాల కొమ్మపై
కట్టుకున్న 'కలల గూడు'
కళ్లముందే కూలిపోవడంతో
పూత రాలిన చెట్టులా..
చెట్టు వాడిన వనంలా..
కన్నీటి గీతమౌతుంది
'ఇంటి ఇల్లాలు తల్లి'

రాత్రి 'మసక జీర'లను
చరణాలుగా సాగదీస్తూ
'అమాయకపు పసికూనలు'
మరిన్ని పల్లెలూ..
మరిన్ని గుడిసెలూ..
అశ్రునయనాలతో బరువెక్కుతున్న
గడప గడపా
మత్తు రాకాసి రక్తదాహానికి బలౌతూ..
శ్రమ జీవుల మెడల్లపై
'మద్యపు విషపు చుక్కల'ను
నాటిందెవరైనా గానీ
తెగిన ఆడకూతుళ్ల తాలిబొట్లు
ఉరితాళ్లై
ఆ హంతకుల్ని
హంతక రాజ్యాలను
ఉరికంబాలెక్కించక మానవు
తలోదిక్కుకు చెల్లాచెదురైన పక్షులన్నీ
గుమికూడి...
ప్రజాస్వామ్యపు 'ముసుగు పరదా'ను
తొలగించే..
పల్లె 'పోరుపతాకాన్నై' గరేయక తప్పవు.

(మద్యపానానికి వ్యతిరేకంగా గొంతెత్తమన్న కర్నూలు రైతు 'హరిసింహ' ఆవేదనకు..)

---

భూస్థాపితం చేయాలి. ఆకాశవాణిలోకి వచ్చే కళాకారులు, సాహితీవేత్తలందరూ దాని మీద నుంచే నడుచుకుంటూ పోవాలి. అవకాశం ఉంటే వచ్చే జన్మలో ఆకాశవాణిలో ఓ చిన్న గరికపోచగా పుట్టాలని కోరిక !

**ఇటీవల వస్తున్న సాహిత్యంపై మీ అభిప్రాయం?**

వయసు రీత్యా అనారోగ్యం, మందగిస్తున్న చూపు కారణంగా నేను పత్రికలనూ, పుస్తకాలనూ క్షుణ్ణంగా చదివి, రెండు మూడేళ్ళయింది. ఇటీవల వస్తున్న సాహిత్యాన్ని లోతుగా, సమగ్రంగా చదవలేదు కాబట్టి, అభిప్రాయం చెప్పలేను.

**తాజాగా మీరు చేస్తున్న రచనలు?**

1946-47 ప్రాంతం నుంచి రచనా రంగంతో నాకు సంబంధం ఉంది. అప్పటి నుంచి పత్రికలకూ, రేడియోకూ, ఆ తరువాత టీవీకీ రాశాను. కానీ ఇప్పుడు నేను కొద్దిగా వెనకబడిన మాట నిజమే. ప్రసార మాధ్యమాలకు నచ్చేలా నేను రాయలేకపోతున్నాను. నాకు నచ్చేది వాళ్ళు వేయడం లేదు. ఇవాళ వినియోగదారుల అభిరుచులకు తగినట్లుగా రచయితలు మారుతున్నారు. మాధ్యమాలు మారుతున్నాయి.

ప్రస్తుతం నా సంపూర్ణ సాహిత్య ప్రచురణలో భాగంగా నాలుగో సంపుటంగా త్వరలోనే నా 'జీవన సమరం' గాథలు మరో ముద్రణతో పాఠకుల ముందుకు రానుంది. అయినా, ఇప్పుడే అవార్డు తెచ్చిన సంతోషాన్ని జీర్ణం చేసుకోనివ్వండి. ఆ తరువాత రాసేవి ఆలోచిస్తాను. అలెగ్జాండర్ చెప్పినట్లు, జయించేవాడికి ఈ ప్రపంచం చాలా చిన్నది. అలాగే, రాయగల దమ్మున్నవాడికి, రాయాలన్న సంకల్పం ఉన్నవాడికీ కావాల్సినన్ని అంశాలున్నాయి.

**మీరు తెలుగులో జ్ఞానపీఠం దక్కిన మూడో రచయిత కదా! మీ ముందు జ్ఞానపీఠ పురస్కారం పొందిన రచయితలు విశ్వనాథ సత్యనారాయణ, సి. నారాయణ రెడ్డి గురించి మీ అభిప్రాయం వినాలనుంది?**

విశ్వనాథ సత్యనారాయణ మహా రచయిత. తాను ఏది సత్యమని నమ్మాడో దాన్నే అక్షరీకరించారాయన. అంతేకాదు. అక్షరీకరించిన దాన్ని ఆచరించారు. ఇక, ద్వితీయ జ్ఞానపీఠ పురస్కృతులైన సి. నారాయణ రెడ్డి వచ్చేసరికి, జీవితంలో వైవిధ్యం వచ్చింది. ఏది చెబితే జనానికి నచ్చుతుందో, ఏది రాస్తే జనం ఆదరిస్తారో గ్రహించి, దాన్ని రాసి, మెప్పించారాయన!

## జ్ఞానపీఠ సాహిత్యం

# సినీ జీవితాల సారం 'పాకుడురాళ్ళు'

- సింహాద్రి నాగశిరీష
9866689326

తెలుగు సాహితీ రంగంలో ప్రతిభామూర్తులు, మణిపూసలు కోకొల్లలు. అయితే వారికి ప్రత్యేక పరిచయాలు అవసరం లేదు. అటువంటి కోవకు చెందిన వారు రావూరి భరద్వాజ. ఈ పేరు వినగానే ముందుగా అందరి స్మృతి పథంలో మెదిలే నవల పాకుడురాళ్ళు. బయటి ప్రపంచానికి ఎంతో ఆర్భాటంగా, ఆకర్షణీయంగా, ఎన్నెన్నో రంగులు, హంగులతో అందర్నీ భ్రమల్లో ముంచెత్తే తళుకు బెళుకుల సినీరంగం, సినీతారల జీవితాలకు సంబంధించిన వాస్తవాలను ఎంతో కూలంకషంగా వివరించి, మన కనుల ముందు పరచిన నవల పాకుడురాళ్ళు. దీనిని నవల అనటం కంటే సినీ జీవితాల సారం అంటే బాగుంటుందేమో. సాహితీ ప్రియులు పదిలంగా దాచుకొనే ఈ అపూర్వ నవల 'పాకుడు రాళ్ళు'

ఒక్కసారి కథలోకి తొంగిచూస్తే, నాయిక మంగమ్మ, మాధవరావు పాత్ర చెప్తున్న కథతో ఈ నవల ఆరంభమౌతుంది. మాధవరావు, అతని స్నేహితుడు ఒక మంచి నాటకాన్ని ప్రదర్శించాలన్న తలంపుతో ఒక నాటక సమాజాన్ని స్థాపిస్తారు. అందులో ఓ స్త్రీ పాత్రధారి అవసరం పడుతుంది. అందుకోసం గుంటూరు నుంచి మంగమ్మను తీసుకువస్తారు. ఆమెతో కూడా నాగమణి అనే మరో స్త్రీ వస్తుంది. అంతా ఆమె మంగమ్మ చుట్టమో, తల్లో అనుకుంటారు. మంగమ్మ అసామాన్య ప్రతిభకు అంతా ముగ్ధులౌతారు. అయితే ఆమెలో మానసిక సంఘర్షణ గమనించిన మాధవరావు కూపీ లాగితే మంగమ్మ అసలు విషయం బయట పెడుతుంది.



తద్వారా నాగమణి ఓ వేశ్యాగృహం నడుపుతోందని, మంగమ్మ ఆమె చేతిలో కీలుబొమ్మ అని తెలుసుకుంటాడు. ఎంతో భవిష్యత్తు ఉన్న ఆమె జీవితం ఇలా నాశనం కాకూడదని, స్నేహితుడు రామచంద్రం సాయంతో ఐదువేల రూపాయల రొక్కం నాగమణి చేతిలో పెట్టి, మంగమ్మకు విముక్తి కలిగిస్తారు. వీరి నాటక సమాజం ఎంతో మంచి పేరు తెచ్చుకుంటుంది. ఇక మంగమ్మ తన ప్రతిభతో అందరి మన్ననలు పొందుతుంది. కాల క్రమేణా కొత్త కొత్త సమాజాలు పుట్టుకురావటం, వీరిలో మునుపటి ఉత్సాహం సన్నగిల్లటం, పోటీ వెరసి వీరి నాటక సమాజం మూతపడుతుంది. కళాకారులంతా తలో దారి అవుతారు. మంగమ్మకు ధైర్యం చెప్పి, ఆమెకు మంచి భవిష్యత్తు ఉందని నచ్చజెప్పి, కొంత డబ్బు ఆమెకిచ్చి సాగనంపుతారు మాధవరావు, రామచంద్రం.

ఎటూ తోచని స్థితిలో ఉన్న మంగమ్మకు భవిష్యత్తు శూన్యంగా అనిపిస్తుంది. కానీ ఎట్టి పరిస్థితుల్లోనూ పాత జీవితంలోకి మాత్రం మళ్ళీ అడుగు పెట్టకూడదనేది ఆమెదృఢ నిశ్చయం. ఇంతలో చలపతి ఆమెను వెతుక్కుంటూ వస్తాడు. ఒకప్పుడు అతను, ఆమె సహనటుడు. తాను సినిమా రంగంలో బాగానే నిలదొక్కుకున్నట్లు, ఏదో గొప్ప సినిమాలో మంగమ్మను నటింపజేస్తానని నమ్మకంగా చెబుతాడు. తనతో మద్రాసు రమ్మంటాడు. ఇక ఏ దారీ లేక అతని వెంట దారి బడుతుందామె. ఇక్కడి నుంచి మార్పుల పర్వం మొదలు. ముందుగా మంగమ్మ పేరు మంజరిగా మార్చుకుంటుంది. పత్రికల వారిని రప్పించి తన రాక మద్రాసు వారికి తెలియజేస్తుంది. చలపతి చెప్పినట్లు అన్ని చోట్ల నడుచుకుంటూ వరిస్థితులకు అనుగుణంగా అన్నీ నేర్చుకుంటుంది. తనను వెండి తెరపై చూసుకోవటానికి ఎవరెవరి అవసరం ఉందో, నిస్సంకోచంగా వారి కోర్కెలు తీర్చటానికి సిద్ధమౌతుంది. అటువంటి క్రమంలో మరో పేరున్న తార కళ్యాణి పరిచయం అవుతుంది. ఆమె నుంచి కొన్ని పాఠాలు నేర్చుకుంటుంది. అవసరం అనుకున్న వారితో సఖ్యంగా ఉండటం, అవసరం తీరాక నిర్దాక్షిణ్యంగా అణగదొక్కుతుంది. తాను ఒకప్పుడు ఏ జీవితం వద్దనుకుందో, చివరికి అదే జీవితంలో తేలుతుంది. తండ్రీకొడుకులతో కూడా జతకట్టటానికి వెనుకాడదు. క్రమంగా మంజరి కనిపిస్తే చాలు, ఆ సినిమా ఢోకా లేదనేంతగా తారాపథంలోకి ఎగబాకుతుంది. బాలీవుడ్‌లోకి అడుగుపెడుతుంది. భారతదేశం తరుపున ప్రభుత్వం పంపగా సాంస్కృతిక ప్రతినిధిగా అమెరికా వెళుతుంది. మార్లిన్ మాన్రో, ఎలిజిబెత్ టేలర్‌లను కలుస్తుంది. కీర్తి మోజులో చేయకూడని ఎన్నో పనులు నిర్మొహమాటంగా చేస్తుంది. ఇంకా కీర్తి, ఆశ చావక ఒక సేఠ్ చేతిలో దారుణంగా మోసపోతుంది. దొంగనోట్ల కేసులో అతను జైలు పాలవుతాడు. ఆ కేసులో అతనితో సంబంధం ఉన్న వ్యక్తిగా బయటపడే మార్గం వెతికే దిశలో, ఓ బ్లూ ఫిల్మ్‌లో నటించటం, వారి నుంచి బ్లాక్ మెయిల్స్, చివరికి ఆత్మహత్య ఇలా మంజరి కథ సమాప్తమవుతుంది. టూకీగా ఇది కథ.

నవల మొత్తం మంజరి పాత్ర చుట్టూ తిరుగుతుంది. అలాగని మిగతా పాత్రలకు ప్రాముఖ్యం లేదని కాదు. ఏ పాత్ర ప్రాముఖ్యత దానిదే. మంజరి పాత్ర ద్వారా పాఠకుడు నవరసాలనూ అనుభవిస్తాడు. మొదటి నుంచి మంజరి పాత్ర పట్ల పాఠకుడిలో ఎక్కడో సానుభూతి ఉంటుంది. పోను పోను ఆమె చేష్టలు జుగుప్స అనిపిస్తాయి. ఆమెలో సుడులు తిరిగే అంతర్మధనం బాధ కలిగిస్తుంది. మనిషిని అంచనా వేయటంలో కార్యాలు సానుకూల పరచటంలో ఆమె చాకచక్యం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆమె తెగువ సమాజంపై కసీ ఒక్కోసారి భయాన్ని కలిగిస్తుంది. ఎంతోమంది చేతిలో అయిష్టంగానే ఆమె నలిగిపోతున్నపుడు ఓ పక్క జాలి, మరో పక్క కోపం కలుగుతుంది. మంజరిలో రకరకాల భావాలు, అనుభూతులు పాఠకుడు తనవిగా అనుభవిస్తాడు. కీర్తి కండూతి అనేది మనిషిని ఎంతగా దిగజార్చుతుందో స్పష్టంగా చూడగలుగుతాము. నిజంగానే సినిమా ప్రపంచం పాకుడురాళ్ళమయమే. ఒకపక్క జారుతూ, దెబ్బలు తగులుతున్నా ఇంకా ఇంకా ఎగబాకాలనే ప్రయత్నం. పైకి వెళ్ళలేము. కిందే కుదురుగా ఉండలేము. ఈ నవలకు 'పాకుడురాళ్ళు' అనే పేరు సరిగ్గా సరిపోయింది.



## ఏది శాశ్వితం ?

- కిలపర్తి దాలినాయుడు

9491763260



కొన్నెప్పుడూ
గట్టిగానే ఉంటాయి
కొన్ని తేలిగ్గా ఉన్నట్టు !
కొన్నెప్పుడూ
మృదువుగానే ఉంటాయి
కొన్ని కాఠిన్యంగా ఉన్నట్టు !
కొన్నెప్పుడూ
సూటిదనాన్ని కోరుకుంటాయి
కొన్ని వక్రతను కోరినట్టు !
కొన్నెప్పుడూ పదునుగానే ఉంటాయి
కొన్ని బండబారినట్టు !
కొన్ని నృత్యం చేస్తూనే ఉంటాయి
కొన్నింటిది ప్రేక్షక పాత్రైనట్టు !
కొన్ని సహజ మరణాలైనట్టు
కొన్ని ఆత్మాహుతులు !
పరిణామం
కాలభ్రమణం చేతిలో
కీలు గుర్రమైనప్పుడు
మన జీవిత కాలమెంత
నీటి బుడగంత!

## మన అమ్మవడి

- రాఘవ మాస్టారు

09741407099

నా తెలుగు తేజం - నా జాతి నిత్య సందేశం
నా తెలుగు కేతనం - అది చరిత వెలుగుల సంకేతం
నా తెలుగు కమ్మన - నా నుడులు తీయన
నా భాష తిక్కన - నా శ్వాస పోతన
నా ఊసు వేమన - నా యాస గోపన

నా అందం కందుకూరి - నా ఛందం అష్ట దిగ్గజాల కవనసిరి
నా నుడి గురజాడ - నా బడి గిడుగు నీడ
నా కనులు కృష్ణా గోదావరి - నామదులు పెన్నా తుంగభద్రల సిరి
మురిసె విశ్వనాధుని కిన్నెరసాని - పలికె సినారె విశ్వంభరవాణి

శాతవాహన చాళుక్యులేలిన సీమ
విజయనగర కాకతీయుల స్వర్గధామ
తెలంగాణ రాయలసీమ కోస్తాల అందాల సీమ
మన్యంవీర అల్లూరి, ఆంధ్రకేసరి టంగుటూరి
కొమురంభీము, కన్నెగంటి హనుమంతులగురి

బొబ్బిలి పల్నాడు పౌరుషప్రతాపాలు
తెలంగాణా పోరు వీరుల చరితలు
కమ్యూనిస్టు పుచ్చలపల్లి సుందరయ్య
సోషలిస్టు భోగరాజు పట్టాభిరామయ్య

తెలుగు ఆత్మ గౌరమన్న అన్న నందమూరి
జానపదజావళీల గద్దరన్న గజ్జలసిరి
ఏరువాక సంక్రాంతి బతుకమ్మల సందడులు
రకరకాల సొగసుయాసల మాండలీకాలు

త్రిలింగ దేశ సంస్కృతీ సాంప్రదాయాలు
అనుంగు పుత్రుల సోదర ప్రేమానురాగాలు
నుదుటి బొట్టు, పంచెకట్టు, చీర కట్టు
వేపచెట్టు, చెరువుగట్టు, పొలంగట్టు

పరమాన్నం, పచ్చడన్నం పులిహోర, పప్పు, చారు
సంకటి, ఊరిబిండి, తొక్కు ఆవకాయ ఆరగింపులు
అమ్మనాన్న అత్త అవ్వ తాత కమ్మని పిలుపులు
ప్రాంతాలు వేరైనా తెలుగు అక్షరాల అనుబంధాలు



ఎందరెందరో మహానుభావుల
తెలుగుజాతి బంధాలు

అందుకే.......
నా తెలుగునుడి
నా అమ్మ వడి
నిత్య శోభాయమానిని
నిత్యాగ్ని హోత్రశుభదాయని
నాజాతి కాత్యాయని
నా తెలుగు రమణీయని
నా ఇరవు నవరసాల మధువని

కథ

# వీలునామా

అమృతకుమారి

9441863731



***ఉదయం 9గం.లు సహజంగా ఆ సమయానికి ఆ వీధంతా కేరేజీలు సర్దుకుని, పనిముట్లతో పనుల్లోకి వెళ్ళే తొందరలో వుంటారు. ఆ కాలనీవాసులు. కానీ ఈ రోజు మాత్రం వాళ్ళందరూ పుట్టెడు దుఃఖంలో మునిగి ఉన్నారు. కాలనీ కాలనీ అంతా "పెద్దమ్మా" అంటూ వాళ్ళు ఆప్యాయంగా పిలుచుకునే ఆవిడ యింటి ముందు గుమిగూడి కన్నీరు మున్నీరవుతున్నారు. వాళ్ళ పెద్దమ్మ శకుంతలమ్మ మాత్రం సుఖదుఃఖాలకు ఆవల, నిశ్చలంగా శాశ్వత నిద్రపోతోంది. ఆవిడకు స్వంత బిడ్డల్లాంటి వాళ్ళు, పెద్దమ్మను కాలనీకి తెచ్చిన సాంబయ్య, గౌరి ఆమె కాళ్ళ దగ్గర కూర్చొని గుండె పగిలేలా ఏడుస్తున్నారు.***

"అయ్యో నిన్ననే గదా సంవత్సరాది పండగనీ మనందరికీ వేపపువ్వు పచ్చడి తినిపించింది. ఇంతలోనే ఏమయింది?" అని ఒకరంటే "అవును ఉగాది పండగనీ పనులు ఎపుడూ ఉండేవే, కాస్త తెల్లారగట్టే లేచి, పిల్లలూ మీరూ తలంటు పోసుకొని గుడికి రండి" అని ఇంటింటికీ వచ్చి ముందురోజు రాత్రే చెప్పింది కూడా" అన్నారింకొకరు. అవును "మహాతల్లి మన కాలనీ వాళ్ళందరినీ తన పిల్లలే అన్నటు చూసేది. మంచి చెడులన్నీ చక్కగా వివరించి చెప్పేది. పనులకు అందరం పోతే పిల్లలను, ముసలి వాళ్ళను ఏదైనా అవసరమొస్తే ఆదుకునేది." అని ఆమె సహాయాలు గుర్తుచేసుకుంటుంటే, ఇంకొకరు "ప్రతీ పండగకీ ఏదో ఒక పిండి వంట చేసి మనందరినీ గుడి దగ్గర జేర్చి పెట్టేది. మనం, మన పిల్లలు తింటుంటే ఎంత సంతోషంగా చూచేది" అని గుర్తు చేసుకొని కంట తడిపెట్టిందొక యిల్లాలు. "పిల్లలందరినీ సాయం కాలం కూచో బెట్టుకొని ఎంత మంచి కథలు చెప్పేదిరా.. మనకూ వినాలనిపించేది గదా!" అంటూ బావురుమన్నాడో కార్మికుడు.

"పెద్దమా! ఎందుకమ్మా మమ్మల్ని అమ్మలేని వాళ్ళను చేసి వెళ్ళిపోయావని" బావురుమన్నారు వాళ్ళంతా.

ఎవరు కబురు చేశారో శకుంతలమ్మ గారి కూతుళ్ళు, అల్లుళ్ళు, వారి వెనకే ఊళ్ళో వున్న బంధువులు వచ్చారు. "అమ్మా" అంటూ శకుంతలమ్మ గారి ప్రక్కన కూలబడి ఏడవటం ప్రారంభించారు, అమ్మాయిలు, అల్లుళ్ళు ఆవిడ ఇంట్లోకి వెళ్ళి సామానులు అవీ చూసుకోసాగారు. అంతలో పెద్దమ్మాయి అంది. "మీరు వెళ్ళి మనవాళ్లని పదిమందినీ పిలుచుకురండి. మా యింటి పేరుగల వాళ్ళను తలకొరివి పెట్టడానికి మాట్లాడి తీసుకురండి" అంటూ భర్తను పురమాయిస్తుంటే, చిన్నమ్మాయి అమ్మ చేతి గాజులు, మెడలో గొలుసూ భద్రంగా ఉన్నాయా? లేదా? అని చూచి, భద్రంగా ఉండటంతో హమ్మయ్య అనుకొని మరలా ఏడవడం ప్రారంభించింది. ఇదంతా చూచిన కాలనీ వాళ్ళు" పెద్దమ్మ కూతుళ్ళా ? ఈ పన్నెండేళ్ళలో వీళ్ళెపుడూ ఇటు రాలేదే, పెద్దమ్మ కూడా వీళ్ళ గురించి చెప్పలేదే?" అని ఆశ్చర్యంగా జరిగేది చూస్తున్నారు. అప్పటి వరకు పెద్దమ్మ పాదాల దగ్గర దుఃఖపడుతున్న సాంబయ్య దంపతుల వైపు అదోలా చూశారమ్మాయిలు. కంగారుపడి వాళ్ళు దూరం జరిగి నిలబడగానే ఆ కాలనీ పాఠశాల ఉపాధ్యాయుడు శ్రీనివాస్ వచ్చారు, లాయర్‌తో. "అమ్మా! మీరు శకుంతలమ్మ గారి పిల్లలా! మీ అమ్మగారు ఆరోగ్యంగా వుండగానే వీలునామా వ్రాశారటమ్మా. నేను చనిపోయాక లాయరు గారికి తెలియపరిచి, మన వాళ్ళందరి ముందూ ఆ వీలునామా చదివించి, అమలయ్యేలా చేయండి మాష్టారూ" అంటూ నన్ను కోరేవారు. అందుకే లాయరు గార్కి తెలియపరిచా. ఇదిగో వారు వచ్చారు." అనగానే పిల్లలు, వారి భర్తలు తెల్లబోయారు. "వీలునామానా, అంత అవసరమేమిటి?" అని మనసులో సందేహించసాగారు. అందరినీ నిశ్శబ్దంగా వుండమని లాయరు గారు సీలువేసిన కవరు తీసి శకుంతలమ్మ గారి వీలునామా చదివి వినిపించారు. అది వినగానే

ఆవిడ గారి పుత్రికారత్నాలు నెయ్యిపోసిన మంటలా భగ్గుమన్నారు. అల్లుళ్ళు ఖంగుతిన్నారు. "అమ్మ చచ్చి కూడా మనల్ని అవమానించింది" ఇంకా ఎందుకిక్కడ పదండి అంటూ బయలుదేరారు. అమ్మ అంతిమయాత్ర కూడా పట్టలేదు వాళ్ళకి "అదీ అమ్మగారంటే అనుకొన్నారు" ఒకప్పటి పాలేర్లు. "అదీ మన పెద్దమ్మంటే" అనుకున్నారు కాలనీ వాళ్ళు. అది చదివిన లాయరుగారు మాత్రం శకుంతల గారి కూతుళ్ళ ప్రవర్తనకు ఆశ్చర్యపోయారు. తల్లి శవాన్ని కూడా నిర్దయగా వదిలేసి వెళుతున్న వాళ్ళను చూశాక ఆయనకు శకుంతలమ్మ గారు ఆ వీలునామా వ్రాసేటపుడు మాట్లాడిన విషయాలు, ఆమె గతం గుర్తొచ్చింది.

అగ్రవర్ణ కుటుంబంలో పుట్టి, అంతకంటే స్థితిపరుల ఇంటిమెట్టి, నౌకర్లు, చాకర్లతో, భోగభాగ్యాలతో తులతూగిన ఆమెకు పద్మజ, నీరజ యిద్దరే సంతానం. చక్కగా పెంచి, చదువు సంధ్యలు చెప్పించి, తమకంటే యింకా ధనవంతులు, పెద్ద వ్యాపారాలు చేసే కుటుంబంలో యిచ్చి నిలువెల్లా బంగారం పెట్టి, ఘనంగా పెళ్ళిళ్ళు చేసేరు పరమేశ్వరరావు గారు. అనుకోకుండా క్యాన్సర్ బారిన పడినపుడు స్థిర చరాస్థులన్నీ యిద్దరి కూతుళ్ళకీ సమానంగా పంచియిచ్చి, వున్నయిల్లు, 6 జతల గాజులు, 4 పేటల గొలుసూ, కొంత రొఖ్ఖం భార్యకు యిచ్చి "శకుంతలా! నాలాగే నీ చివరి శ్వాస కూడా ఈ ఇంట్లోనే వదలాలి. ఎవరికీ యివ్వకు. పిల్లలకివ్వాల్సింది ఇచ్చేశాము. నీ భవిష్యత్‌కు నేను మిగిల్చింది ఇదే. ఇదైనా జాగ్రత్త చేసుకోమంటూ" వెళ్ళిపోయారు. చేతిలో రొఖ్ఖం ఆయన అంత్యక్రియలకు ఖర్చుకాగా, లంకంత యిల్లు ఒక్కదానికి ఎందుకని చివరి రెండు పోర్షన్లూ అద్దెకిచ్చి, ఆ కిరాయితో పరువుగా నెట్టుకొచ్చే ఆవిడ మీద బిడ్డలు పిడుగు పడేశారు. పండక్కని భర్తా, పిల్లలతో వేంచేసిన పుత్రికారత్నాలు తల్లికి తెలియకుండా ఇల్లు అమ్మకం పెట్టారు. ఇప్పటిదాకా "పోన్లేపాతకొంపే గదా! అదెంత చేస్తుంది" అనుకొంటున్న వాళ్ళకు ఆ ఇంటి రేటు ప్రస్తుతం ఎంత చేస్తుందో తెలిసే సరికి అమ్మేయాలనే ఆశ. అమ్మ ఎక్కడుంటుంది అనే ఆలోచనే వాళ్ళకి రాలేదు. "అరవై పై బడిన వయసులో ఇల్లు లేకుండా ఎలా ఎక్కడికి పోను?" అంటూ దగ్గర వాళ్ళ దగ్గర కన్నీళ్ళ పర్యంతమైతే, చిన్ననాటి, స్నేహితురాలి కొడుకు వచ్చి నిలదీశాడు. మీరెవరు ఇల్లు అమ్మడానికని మెలిక పెట్టాడు. అడిగిన వాళ్ళందరికీ అన్నీ సర్ది చెప్పి ఆఖరికి ఇల్లు అమ్మనే అమ్ముకున్నారు.కార్య సాధకులైన కూతుళ్ళు, కాకపోతే పెద్దల్లోకి విషయం వెళ్ళింది గనుక వచ్చిన సొమ్ము 3 వాటాలు వేసి 10 లక్షలు శకుంతలమ్మ గారికిప్పిస్తే, అందులో కూడా, "అమ్మా! నీకు అనారోగ్యంగా వుంటే హాస్పిటల్‌కి అప్పుచేసి ఖర్చుచేశామని, చెప్పి వడ్డీతో సహా 4 లక్షలు మళ్ళీ గుంజుకున్నారు. ఎక్కడుంటారు అని అడిగిన వాళ్ళతో ఇపుడు నేను పెద్దమ్మాయింటికి వెళ్తున్నానంటున్న ఆమెతో "ఇంకెందుకమ్మా! మాతో రావటం. ఇంత అల్లరి పెట్టి, సమానవాటా తీసుకున్నావుగా. ఇంక నీకూ, మాకూ ఏ సంబంధం లేదు. నీకు మాకంటే డబ్బే ఎక్కువైంది గదా! ఆ డబ్బుతోనే వుండు" అంటూ కరాఖండీగా చెప్పేసి వెళ్ళిపోయారు. అంతే ఆవిడ మనసు ముక్కలైంది. ఎండా వానా అనకుండా, కాళ్లరిగేలే తిరిగినా తనకొచ్చే వడ్డీలో తక్కువ అద్దెకు ఇల్లు దొరక్క, ఇల్లుకొన్నవాళ్ళు "అమ్మా గడువు అయిపోయింది గదా మరి" అని నసుగుతూవుంటే ఏం చేయాలో ఎక్కడికి పోవాలో దిక్కుతోచని స్థితిలో ఆపద్బాంధవుడిలా వచ్చాడు సాంబయ్య. ప్రక్కనే వున్న కోటా కొట్టు దగ్గర తనని చూచి పలకరించి, తన స్థితికి ఆవేదనతో అల్లాడిపోయాడు, ఒకప్పటి తన నౌకరు సాంబయ్య. "ప్రస్తుతానికి నాతోరండమ్మా" తరవాత ఏదోకటి చేద్దాం" అంటూ సామాన్లనూ, ఆమెనూ ఆ కాలనీకి చేర్చాడు.

ఆ కాలనీలో ఖాళీగా వున్న కాలనీ ఇంటిని సాంబయ్య శకుంతలమ్మ గారికి యిప్పించాడు. ఆ ఇల్లు గలవారు వేరే గ్రామానికి వెళ్లిపోతే, సాంబయ్య వాకబు చేసి మాట్లాడాడు. కొద్దిపాటి పెట్టుబడితో మరుగుదొడ్డి అవీ దగ్గరుండి కట్టించాడు. రోజూ రెండుపూటలా భార్యాభర్తలు వచ్చి యోగక్షేమాలు కనుక్కుంటూ, వాళ్ళే తన అసలు బిడ్డలన్నట్లుగా మసలుతుంటే, ఋణానుబంధమంటే ఇదేనా అనుకునేదావిడ. పరిసరాలు అలవాటయ్యాక నెమ్మదిగా చిన్న కిరాణాకొట్టు ప్రారంభించి, మిగిలిన సొమ్మును డిపాజిట్ చేసేసింది.



అలా మలి సంధ్య ప్రయాణం ప్రారంభించిన శకుంతలమ్మ గారు ఒకనాడు బాగా ఆలోచించి వీలునామా వ్రాసి పెట్టారు. తన తదనంతరం ఆఇల్లూ, బ్యాంకులో వున్న డిపాజిట్టూ బాపతు సొమ్మూ, తనకు పుత్రసమానుడైన సాంబయ్యకు, అతని భార్యకు చెందాలని, తన చేతికున్న బంగారు గాజులు, గొలును సాంబయ్య భార్యకివ్వాలని, తన అంత్యక్రియలు అతనే చేయాలని పేర్కొంటూ అన్నట్లు డిపాజిట్‌కు నామినులుగా కూడా వారిపేర్లే వ్రాసిందావిడ. ఒకవేళ ఆత్మాభిమానం గల సాంబయ్య, గౌరి అలా తీసుకోవడానికి నిరాకరిస్తే వారి నాయకత్వంలో ఆ సొమ్మంతా ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసి, ఆ సొమ్ముపై వచ్చే వడ్డీతో కాలనీలో జరిగే మంచి కార్యక్రమాలకు అందరి అంగీకారంతో ఖర్చు చేసుకోవాలని, ఒంటిపై నగలు కూడా అమ్మి ఆ సొమ్ముకు జతచేయండి అని కోరింది.

ఈ వీలునామా గురించే పాపం ఆవిడ కూతుళ్ళకు కడుపు మండింది. డబ్బూ, నగలే కాకుండా, ఇల్లు, సామాగ్రి, పిల్లల మధ్యాహ్న భోజనం కోసము ఉపయోగించుకోమని కూడా వ్రాశారావిడ. ఇక తన కర్మకాండలంటూ తీసిన సొమ్ముగానీ, కాలనీ వారి సొంత సొమ్ము కానీ ఎక్కువ ఖర్చు చేయొద్దనీ, పదవ రోజున అందరూ సమిష్టిగా వంట చేసుకొని, తనను తలచుకొని తృప్తిగా భోజనం చేయండని, ఎప్పటికీ అందరూ కష్ట సుఖాలలో కలసి మెలసి ఉండాలని కాలనీ వాసులకు విడిగా వ్రాసిన ఉత్తరంలో పేర్కొందావిడ. ఆ ఉత్తరాన్ని చదివి వినిపిస్తూంటే కాలనీ వారి కళ్ళ నుండి ధారాపాతంగా కన్నీళ్ళు కారుతూ వాళ్ళ పెద్దమ్మకు వాళ్ళపైనున్న ప్రేమకు ప్రతిచర్యను తెలిపాయి.

"అయిందా? సంబరం. ఇంకా ఎందుకిక్కడ. ఈ మురికి కంపులో లేవండి అంటూ శకుంతలమ్మ గారి కడుపు పంటలు, అమ్మ అంతిమయాత్రనైనా చూడకుండా బయల్దేరారు" కాలనీ వాసుల ప్రేమ జల్లుల్లో శకుంతలమ్మ శరీరం హుందాగా మహా ప్రస్థానం సాగించింది.

పాట

# కొత్త కథ

- చెళ్ళపిళ్ళ శ్యామల
9949831146

ప	కల్మష మెరుగని మల్లీ
ఓ కొత్త కథ నీకు చెబుతానె తల్లీ
మేక వన్నె పులుల నుండీ
బాల్యాన్ని కాపాడుకో జాబిల్లీ

చ1.	బుజ్జీ ! బాగున్నావంటూ
బుగ్గ గిల్లుతాడొకడు
మాయమాటలేవో జెప్పి
వికృత చేష్టలు చేస్తాడొకడు
చాక్లెట్లు, బొమ్మలు చూపి
చాటుకి తీసుకు పోతాడొకడు
సమయము చూసి ఘోరము చేసి
ప్రాణాలు తీసేస్తాడు
నరరూప రాక్షసుడమ్మా వాడు
మామయ్య తాతయ్య
బాబయ్య బంధువు
ఏ తోలు కప్పుకుంటాడో
వాడు ఏ నిమిషమేమి చేస్తాడో !
ఎవ్వరినీ నమ్మవద్దు
ఒంటరిగ నీదరికి రానీయొద్దు !
॥కల్మష॥



చ2.	అడవి మృగము కన్న
క్రూరమైన మృగము
మగవానిగా వచ్చునమ్మా !
నాగు పాము కన్న
విషము గ్రక్కేటోడు
నీ మధ్యనే మసలేనమ్మా !
పాల బుగ్గల పసిమి కాలరాసేస్తాడు
కాల యముడే తల్లీ వాడు
కాన రాకు వాడి కెపుడూ
కీచకుడు రావణుడు
బూచాడు వాడమ్మా !
ఏ చోట దాపురిస్తాడో
వాడు ఏ రాత నీకు రాస్తాడో
ఎవ్వరినీ నమ్మవద్దు
ఒంటరిగా నీ దరికి రానీయొద్దు !
॥కల్మష॥

# భ్రాంతి

ఎస్. విజయలక్ష్మి
9347426345

నాలుగు గోడల పెంకుటింటి
ద్వారబంధానికి గుమ్మం ఒక హద్దుగా వుండేది
మనుష్యుల మధ్య మమతానుబంధాలు వుండేవి
ద్వార బంధానికి బంధీలైన అనుబంధాలు
ఉమ్మడి కుటుంబాలకి ఊత కర్రలయ్యాయి
గుమ్మాలే లేని డాబా యింట్లో
హద్దులు లేవు సరిహద్దులు లేవు
ఉద్యోగ పర్వంలో ఉదయం లేస్తే
అందరూ ఎగిరిపోయే పక్షులే
బోసిపోయిన ఆ యింట్లో పలకరింపులు కరువే
ప్లాస్టిక్ ముగ్గులు, ప్లాస్టిక్ తోరణాలు
ప్లాస్టిక్ పువ్వులు, ప్లాస్టిక్ నవ్వులు
మనుషుల మనసులు ప్లాస్టిక్ మయం
చూడటానికి అందంగా కనిపిస్తుంది
ఎక్కువ కాలం మన్నుతుంది
దగ్గరికి వస్తేనే కంపుకొడుతుంది
దూరపు కొండలు నునుపు నేటి మానవతా
విలువలు



సంక్రాంతిలో క్రాంతి మయమై
భ్రాంతి మాత్రమే మిగిలింది.
పబ్‌లకి, క్లబ్‌లకి అలవాటు పడిన యువతరం
పండగ సరదాలు మరచిపోయింది
పిజ్జాలకి, బర్గర్లకి రుచి మరిగిన పిల్లకాయలు
పులిహోర, చిల్లుగారె వాసనలే గిట్టవు
నెట్‌లో చాటులు తప్పా
గాలిపటాల సంబరాలు తెలియదు
ఫేస్‌బుక్‌లో ఫేసులు తప్పా
అనుబంధాలు పంచే బంధువుల ఫేసులు తెలియవు
హరిదాసులు లేరు డూడూ బసవన్న రాడు.
అంతా అపార్టుమెంటు మయం
గ్లోబలైజేషన్‌లో అంతా ఫెర్టిలైజేషన్

# వేమన - శాస్త్రీయదృక్పథం




బి. శివప్రసాద్

8790414087

వేమన ఒక విలక్షణమైన వ్యక్తి. ఆయన కవిగా, యోగిగా, తాత్వికుడిగా, సంఘసంస్కర్తగా, సత్యాభిలాషిగా సమసమాజాన్ని కోరిన మనిషిగా, తెలుగు సాహిత్య చరిత్రలో అజరామరుడుగా నిలిచిపోయాడు. మృదుమధురమైన ప్రజల భాషలో, కొండంత భావాల్ని అద్దంలో చూపించినట్లుగా అలతి అలతి పదాలతో, ఆటవెలుదుల రూపంలో తత్వాన్ని బోధించిన మహామనిషి వేమన. కుల తత్వాన్ని, సాంఘిక దురాచారాల్ని, అంధ విశ్వాసాల్ని విశ్వదాభిరామ వినురవేమ అనే ఈటెత్తి సమాజంపై విసిరి మార్పుకోసం తపించిన సంఘసంస్కర్త ఆయన. వేమన భావజాలం, కవిత్వంలో కనిపించే అశ్లీలం, కొందరి దృష్టిలో దిగంబరత్వంగా గోచరించవచ్చు. సమాజంలో జరిగే అన్యాయాలు, జీవితంలో జరిగే ఒడిదుడుకులు, బాధలు మనిషిలో ఎంతో మార్పును తెస్తాయి. వేమనకు పుస్తక జ్ఞానం సున్న అని, సహజజ్ఞాన సంపన్నుడని, భావ పూర్ణుడని కట్టమంచివారి అభిప్రాయం. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ 'వేమన కవిత్వం గాలి వంటిది, అది చూడని చోటు లేదు దొరకని తావు లేదు' అన్నారు. వేమన ఏ మతాన్ని నమ్మలేదు. ఏ కులాన్ని వెనకేసికొచ్చినట్లు లేదు. వేమన వ్యక్తిత్వాన్ని విభిన్న కోణాల్లో పరిశీలించవలసి వుంది. ఆయన కవిత్వంలో మృదుత్వం, కఠినత్వం, వ్యంగ్యం, ప్రేమతత్వం, సంసార వేదనా పూరితం, స్త్రీ వివక్షత 'మానవతావాదం', యోగతత్వం మరెన్నో కనిపిస్తాయి. తన కవిత్వంలో తన జీవితానుభవాలే కాక, ప్రాపంచిక విషయాల్ని ప్రతిఫలింపచేశాడు. ఆయన జీవితం సజావుగా, సాఫీగా సాగలేదు. జీవితంలో సంతోషాల్ని, కన్నీళ్ళను, శోధనల్ని, బాధల్ని, ప్రేమాభిమానాల్ని, సమపాళ్ళలో అనుభవించాడు.

వేమన కవితా సౌందర్యం అనన్య సామాన్యం. తన కవితా కన్యకు లేనిపోని శాస్త్ర లేపనాల్ని రుద్దలేదు. అతి క్లిష్టమైన పదాలకు తన కవిత్వంలో తావివ్వలేదు. ఒకప్పటి కవులు తాము పాండిత్య బలాన్ని తమ రచనల్లో చొప్పించేవారు. అప్పటి తెలుగు సాహిత్య ప్రతిభామూర్తులు సంప్రదాయాలను వదల లేక కావ్యలక్షణ సూత్రాలకు కట్టుబడి రచనలు చేసేవారు. కాని మధురమైన పదజాలంతో ఆటవెలది కన్యను అతి సుందరంగా తీర్చిదిద్దాడు వేమన. ఓ సాహితీ ప్రియుడు 'కావ్యలక్షణ శాస్త్రాల కొలతల ప్రకారం కత్తిరించి నిర్మించిన కవిత్వం కాదు, వేమనది' అంటాడు. జన సామాన్యం నుంచి జనించిన నుడులను, జాతీయాలను, లోకోక్తులను తన కవిత్వంలో ప్రవేశపెట్టాడు వేమన. అలతి పదాలైనా ఎంతో అర్థవంతమైన, గంభీరత్వాన్ని సంతరించుకోవడం వేమన పద్యాల్లో చూడవచ్చు.

మూఢనమ్మకాలు వేమన కాలంలో ప్రజలను శాసించేవి. అమాయిక ప్రజలు ఎవరో చెప్పిన మాటలకు విలువ నిచ్చేవారు. నేడు కూడా సినిమాలు, కథలు, దయ్యాలు, పిశాచాలు, పూనకాలు ప్రజలలో మూఢనమ్మకాలని పెంచిపోషిస్తున్నాయి. మూఢనమ్మకాలు, శకునాలనేవి ఒక మతానికి, ఒక సంస్కృతికి పరిమితమైనవి కావు. ఆనాడు సమాజం పాటించింది. ఛాంధసులను మరింత ఛాందసులుగా మార్చుతున్న ఆ రోజుల్లో వేమన నిశితంగా శకునాలను విమర్శిస్తాడు.

పాలపిట్ట శకున ఫలమిచ్చునందురు
పాలపిట్టకేమి ఫలము దెలియు?
జనుల కర్మములను శకునముల్ నిల్పునా?

బల్లి పలుకులు విని ప్రజలెల్ల తమ పనుల్
సఫలములగు నంచు సంతసించి
కాని పనులకు తమ కర్మమటందురు

గూబ చేర గృహము గునిసి పాడుగ బెట్టి
వెళ్ళిపోదు రెంత వెర్రివారొ!
గూబ గృహము లేమి కూర్చురా కర్మంబు?

పాలపక్షి శకునము మంచి ఫలమిచ్చు అంటారు. ఆ పక్షికి

ఫలము గూర్చి ఏమి తెలుసు మనిషికి కలిగే మంచి చెడ్డలను గూర్చి పక్షికేం తెలుసు? తిథి, వారం, అంటూ ప్రతి పని ప్రారంభానికి శుభలగ్నం చూసుకొనే రోజులొచ్చాయి. శకునాలు, జనుల దిశా నిర్దేశాలను నిర్ణయిస్తాయా? బల్లి పలుకులు విని మన పనులు సఫలమౌతాయని అనుకోవడం అవివేకం. గుడ్లగూబ ఇంటిలో ప్రవేశిస్తే ఇల్లు విడిచి వెళ్ళాలని ఆ రోజుల్లో భావించారు. పక్షులు మనిషి తలరాతను మార్చగలవా?, గూబ మనిషికి చేసిన పాపమేమి? అని వేమన ప్రశ్నిస్తున్నాడు.

జీవ హింసను వేమన నిరసిస్తాడు–

జీవి జంపుటెల్ల శివభక్తి తప్పుటే
జీవి నరసి కనుడు శివుడు యగును

జీవుడు శివుడనుట సిద్ధంబు తెలియరా
చంపకూడ దెట్టి జంతువునైనను
చంపవలయు లోక శత్రుగుణము

జీవహత్య చేయుట శివుని చంపుటయే అవుతుందని అర్థాన్ని బోధిస్తాడు. ముత్యాలమ్మ, పోలేరమ్మ అనుగ్రహాలు ఊరిని కాపాడుతాయని మేకలు, గొర్రెలు వంటి జంతువులను బలిచ్చి, జాతర్లు జరుపుతారు. అమ్మవారు పోసినపుడు పిల్లలకు టీకా వేయనీయరు. ఆ విధంగా చేస్తే అమ్మవారికి కోపమొస్తుందని నమ్మకం. బుద్ధుడు యజ్ఞయాగాదులలోని పశుబలిని నిరూపించాడు. దేవుడూ, పూజలు లేవు పొమ్మన్నాడు. నీతి సూత్రాలతో సమాజం నడవాలన్నాడు.

పేరు సోమయాజి పెను సింహబలుడయా
మేకపోతు బట్టి మెడలు విరువ
కాని శత్రువు వలన కలుగునా మోక్షంబు

యజ్ఞం చేసే యజమానిని 'సోమయాజి' అంటారు. పూజలు, యజ్ఞాలు జరిపేందుకు కొంతమందే అర్హులు. సమాజం వారికి ప్రత్యేక స్థానమిచ్చింది. ఆ క్రతువుల్లో మేక మెడవిరిచి చంపేస్తారు. సోమయాజులు పూజ్యులుగా పేర్కొనబడితే, హింసతో యజ్ఞం చేయమనడం ఎంత అవివేకం. దానివల్ల పుణ్యం లభిస్తుందా? అమాయకపు జీవుల మెడల్ని వంచడంలో ఆయన సింహబలుడని ఎగతాళి చేస్తాడు వేమన. హింసను ప్రోత్సహించే సోమయాజికి సమాజం పట్టం గట్టడాన్ని వ్యతిరేకిస్తాడు.

పుణ్యక్షేత్రాల్లో యజ్ఞాలవంటి కార్యాలలో గుండు గొరిగించుకోవడం ఆచారం. అక్కడ మంగలి ఉపయోగించే జలం మంత్రజలం కంటే గొప్ప అని వేమన వ్యంగ్యంగా చిత్రీకరించాడు. స్వామీజీల పాదాలను కడిగిన జలాన్ని తలపై చల్లుకుంటారు. ఆ మురికినీరు పాపాల్ని, శంకల్ని తొలగిస్తాయనుకోవడం ఎంత అర్థరహితమో వేమన వివరిస్తాడు. గాలిలో నుంచి వస్తువుల్ని సృష్టించలేము అని శాస్త్రం చెబుతుంది. శాస్త్రీయ దృక్పథంతో నిశితంగా పరిశీలిస్తే వాటిలో దాగున్న వాస్తవికత బయట పడుతుంది. మంత్రాలతో, పూజలతో, తాయెత్తులతో రోగాలు నయం కావు.

పాడిగాడు జగతి పంచాంగములు చెప్పి
కొంచమైన బుద్ధి నొంచలేక
బ్రహ్మ మెఱుగ కిట్లు పౌరోహితము జేయు

పంచాంగంలో చెప్పినవి పాటించి మానవులు మూఢులుగా మారుతున్నారని వేమన తెలియజేస్తున్నాడు. జ్యోతిష్యం శాస్త్రం కాదు. గ్రహస్థితుల ఆధారంగా మనిషి భవిష్యత్తును నిర్ణయించడం అవివేకం.

మంచి శకునములని మెచ్చి పెండ్లిసేయు
వారె కాని లేరు వసుధ నొకరు
జనుల కర్మలకు శకునములు నిల్చునా?

శకునాలన్నీ సరిగా చూసుకొనే పెళ్ళిళ్ళు చేస్తాం. మంచి శకునమని, ముహూర్తం బలంగా ఉండాలని నిర్ణయించినా, మరి ముందే చనిపోతారెందుకు అని వేమన మూఢనమ్మకాల్ని దుయ్యబడతాడు. భార్యాభర్తల మధ్య వివాహం, విడాకులకు దారితీయడం, దంపతుల మధ్య కలహాలు, కలతలు, మానసిక రుగ్మతలకు గురికావడం జరుగుతుంది.

శనియె చాలదనుచు ననిరట కొందఱు
శనికి జాల నిదది కనగలేరు
కర్మఫలమే మిగుల గష్టమల్ గుడుపును

శని దశ బాగా లేక కష్టాలు కలుగుతున్నాయని వాపోతాము.

భూతి పూసినీవు ప్రేత భూతంబుల
వెడలగొట్టు బోవ వెఱ్ఱి వనుచు
నిన్నె గాంచి భీతి నిలువక పారరో?

విభూతి పూసుకొని, భూతములను తరిమే నాటక సూత్రదారులెంతోమంది ఉన్నారు. భూతం, దయ్యం అన్నవి అభూత కల్పనలని వేమన దృక్పథం,

వేమన విగ్రహపూజల్ని, బాహ్యాడంబర జప తపాల్ని నిర్భయంగా ఖండించాడు.

శిలను ప్రతిమ జేసి చీకటిలో బెట్టి
మ్రొక్కి వలవదికను మూఢులారా!

శిలల జూచి నరులు శివుడని భావించి
శిలలు శిలలెకాని శివుడుకాడు
రాళ్ళదెచ్చి నరులు రమ్యమౌ గుడిగట్టి
రాతి ప్రతిమ జేసి ఖ్యాతిగాను
దేవుడనుచు మ్రొక్క దీవించి పల్కునా

పలుకని రాతికి పనికిమాలిన మ్రొక్కుబడులతో నిత్యం పూజిస్తూ ఉంటాం. ఈ పద్ధతిని విడనాడండి. దేహాన్ని గుడిగా భావించండి. చెడురాళ్ళకు వట్టిపూజ చేయుదురెందుకు అంటాడు వేమన. ఒక రాతిని పూజించడం వల్ల భగవంతుని కనుగొనగలిగితే

## కవిత

# కాలాన్ని జయిస్తున్న వాళ్లు

- ఎమ్వీ రామిరెడ్డి
9866777870



గుడిలాంటి ఆ ఆశ్రమంలోకి
కాలు పెట్టానో లేదో
వాళ్ళంతా బిలబిలమంటూ పరిగెత్తుకొచ్చి
నా చుట్టూ చలువపందిరి వేశారు
తొంభై మంది చిన్నారుల చిరునవ్వుల వెనక
ఎక్కడా కాలుష్యపు జాడలేదు
పసిమనసుల పసిడి కేరింతల్లో
ఎక్కడా కల్తీధ్వనుల కలకలం లేదు
వాళ్ళ కళ్లు మాత్రం ప్రశ్నల కత్తులు దూస్తున్నాయి
పాపపు మూలాల్ని అన్వేషిస్తున్నాయి
క్షేమ సమాచారం పరస్పరం పంచుకున్నాక
వాళ్లంతా నాతో కరచాలనం చేసి
తలా ఒక స్వీటు తీసుకుని తాపీగా వెళ్లిపోయారు

* * *

శ్రద్ధగా చదువుకుంటూ ఒక చిన్నారి
బోరు దగ్గర బట్టలుతుక్కుంటూ మరో బుజ్జాయి
చెస్ బోర్డు మీద వ్యూహాలు నూరుతూ ఇద్దరు బాలమేధావులు
ఆశ్రమానికి అవతల పక్క
అడ్డదిడ్డంగా పెరిగిన గడ్డి పీకేస్తూ ముగ్గురు శ్రమవీరులు
ఎవరి పనిలో వాళ్లు
ఎవరి లోకంలో వాళ్లు
నాలో పడగ విప్పిన ప్రశ్నలు మాత్రం బుస కొడుతూనే ఉన్నాయి
ఆ బుల్లి ప్రపంచాల్లోకి తొంగి చూశాను పరిశీలనగా-
ఆత్రంగా వెదికాను వాళ్ల గాయాల ఆనవాళ్ల కోసం
ఎంత తవ్వినా వాళ్ల లోలోపలి పొరల్లో
ఎక్కడా నిరాశ లేదు, నిస్పృహ లేదు
ఏదో కోల్పోతున్నామనే జాడలసలే లేవు
అందరి మొహాల్లోనూ
సామూహిక ఆత్మ విశ్వాస శరచ్చంద్రికలు
వాళ్ల కనుపాపల్లో
కాలాన్ని జయిస్తున్న ధైర్యపూరిత విజయోత్సవం
నుదుటిమీద కాలంరాసిన
హెచ్ఐవీ గీతల్ని తిరగరాస్తున్న సాహసతేజం

* * *

అక్కణ్నుంచి వెనుదిరుగుతుండగా
నా కళ్లనుంచి ఓ నీటిచుక్క రాలిపడింది
ముళ్లపొదలు మాయమై రహదారి ప్రత్యక్షమైనట్టు
మబ్బుల గుంపు చెదిరిపోయి ఆకాశం నిర్మలమైనట్టు
నాలో గడ్డ కట్టుకున్న సానుభూతి శిలలు కరిగిపోయాయి
ఎర్ర రిబ్బన్ నుదుటికి కట్టుకుని
సరికొత్త స్ఫూర్తితో బయటికి నడిచాను
ఒక నినాదమై విచ్చుకుంటూ-

---

నేనొక పర్వతాన్నే పూజిస్తాను అంటాడు కబీరు.

గట్టిరాళ్ళు తెచ్చి, కాళ్ళు చేతుల త్రొక్కి
కాసెయులులు చేత గాసి చేసి
మొరకు రాళ్ళ కెరగు మొప్పల నేమందు

గట్టిరాళ్ళు తెచ్చి, శిల్పులు కాళ్ళ చేత త్రొక్కి ఉలులు, సుత్తెలతో కావలసిన రూపును మలిచి, విగ్రహంగా మార్చుతారు. విగ్రహాలు కూడా ఆకారాన్ని బట్టి ఆరాధించబడతాయి. దేవుడొక్కడే అంటారు. నేడు వేయిరూపాల్లో దేవుళ్ళను కొలవడం అలవాటు అయింది. దేవుడికి విలువైన వస్త్రాలు రుచికరమైన వంటలు నైవేద్యంగా పెడతారు. దాన్ని మనమే ఇష్టంగా తింటున్నాం. దేవుడేమైనా తింటాడా? ఆకలిగొన్నవాడి కడుపుకు ఆ నైవేద్యాన్నైనా ఇస్తే సంతోషిస్తాడు.

గంగలో మునిగి చేసిన పాపాలు పోవాలని మొక్కుకుంటే నరిపోతుందా? గుండు చేయించుకొని భాగ్యవంతునిగా చేయమంటారు. నీటిలో మునిగినంత మాత్రాన మోక్షప్రాప్తి గలిగితే, కప్పలు కూడా నీళ్ళలోనే జీవిస్తున్నాయి కదా అంటారు కబీరు. మనసులో మాలిన్యం పెట్టుకొని గంగలో మునిగితే పోతుందా? మనసులోని కల్మషం కడిగి వేయాలి. పుట్టమీద కొడితే పాము చావదు. చక్రాంకితాలు వేసుకుంటే ఘనుడు కాదు. దేహాన్ని దండిస్తే మనసులోని మలినం పోదు. సత్యప్రబోధకులు ప్రజలను సన్మార్గంలో నడువాలని ఉపదేశించారు.

వేమన మానవత్వాన్ని పెంచే ఆధునిక తత్వాన్ని ప్రబోధించాడు. మానవునిలో ఉన్న మౌఢ్య శృంఖలాలను ఛేదించే ప్రయత్నంలో మూఢనమ్మకాలను ఛిన్నాభిన్నం చేశాడు. శాస్త్ర దృక్పథం అనుకోకుండానే ఆయన పద్యాల్లో దాగి ఉంది. నిశితంగా పరిశీలిస్తే ఆయన విచక్షణా దృష్టి, వివేచనా శక్తి, వాస్తవ విషయ పరిజ్ఞానం నేటి మానవుని కెంతో అవసరం.

# ప్రసవ వేదన

కథ



గూడూరు గోపాలకృష్ణమూర్తి
08922-231605

అప్పలస్వామి పాలవ్యాపారం చేస్తూ తన జీవన యాత్ర సాగిస్తున్నాడు. అతని దగ్గర చాలా ఆవులున్నాయి. ఆ ఆవుల పాలను అమ్మి డబ్బు చేసుకోడానికి పాల వ్యాపారం చేస్తూ కాస్తో - కూస్తో డబ్బు సంపాదిస్తున్నాడు. అసలే ఆవుపాలు చిక్కగా ఉండ కుండా పలచగా ఉంటాయి.

ఆ ఆవుపాలే ఇంటింటికి తీసుకువచ్చి ఇమ్మంటే ఆ పాలలో నీళ్ళు కలిపి ఇంటికి తెచ్చి ఇస్తాడు. ఇది వ్యాపార లక్షణం అందుకే సత్యమూర్తి నేరుగా అప్పలస్వామి ఇంటికే వెళ్ళి పితికిన పాలు తెచ్చుకుంటారు. అదే అతని అలవాటు.

అంతేకాకుండా కూతుర్ని పురుటికి తీసుకువచ్చాడు. కూతురు జానకికి మొదట ఒక అమ్మాయి. ఆ అమ్మాయికి సంవత్సరం అవకుండానే మళ్ళీ పురుటిరోజుల రావడం, పురుటికి పుట్టింటికి తీసుకురావడం అయింది. అసలే దగ్గరకాన్పు అంతే కాకుండా జానకి చాలా బలహీనంగా ఉంది. పురుటికి తీసుకు వచ్చే వరకూ అన్ని పనులూ తను ఒక్కర్తే చేసుకునేది. చంటి పిల్ల ఆలనా, పాలనా అంత నీరసంలోనూ తను ఒక్కర్తేచూసుకునేది.

రోజూ రెండు పూటలా పాలు త్రాగించడం వల్ల జానకి కొద్దిగా తేరుకుంది. తను మాత్రం ఏం చేయగలదు? అవతల అత్తవారి సహకారం ఎంతమాత్రం లేదు. ఇవతల పుట్టింటి వారూ సహాయపడకపోతే ఎలా? అందుకే తన భార్య వెళ్ళి కొన్నాళ్ళు కూతురికి ఆసరాగా ఉండి వచ్చింది. తన భార్య అయినా ఎన్నాళ్ళు అక్కడ ఉండగలదు? కూతురు కొద్దిగా తేరుకున్నాక కూతుర్ని పురిటికి తీసుకుని వచ్చింది.

అప్పలస్వామి పెరట్లో ఆవు ప్రసవవేదన పడ్తోంది. నోరు లేని జీవి అది. తను బాధపడ్తూ అటు ఇటు తిరుగుతోంది. గట్టిగా అరుస్తోంది. మూల్గుతోంది. ఆయాసపడుతోంది.

ఆ మూగ జీవికే మాట్లాడే శక్తి ఉంటే ఎంతగా తన బాధను మాటల రూపంలో వ్యక్త పరిచేదో, అలా చేయలేని నిస్సహాయస్థితి ఆ మూగజీవిది. అప్పలస్వామి, భార్య పైడమ్మ ఇదంతా మామూలు విషయమే అన్నట్టు నిబ్బరంగా ఉన్నారు. ఆ మూగజీవి బాధను ఎలా పోగొట్టాలి? ఏం చేయాలి ? పశు వైద్యుడ్ని తీసుకురావాలి అన్న ఆలోచన కూడా విడిచి పెట్టి ఎంత త్వరగా ప్రసవం అవుతుందా అని ఎదురు చూస్తున్నారు.

అదే గర్భిణీస్త్రీ అయితే అలా చేయగలరా? అంత నిబ్బరంగా ఉండగలరా? ప్రశ్నించుకున్నాడు సత్యమూర్తి.

పశువుకి గర్భంలో పిండం పెరుగుతూ ఉంటే గర్భిణీ స్త్రీకి జరిగినటువంటి చెకెఫ్‌లుండవు. మందులుండవు. ఇంజక్షన్లు - బలానికి టానిక్కులుండవు. స్కానింగులు అసలు ఉండవు.

ఒకవేళ పశువులకి కూడా స్కానింగులుంటే ఆడదూడ కావాలనుకునే అప్పలస్వామి లాంటి వ్యాపారులు కోడె దూడ గర్భంలో ఉందని తెలుస్తే ఆ మూగజీవికి కూడా అబార్షను చేయించే వారేమో !



మానవ సమాజంలో జరుగుతున్న తంతు అదే కదా! ఆడపిల్ల గర్భంలో పెరుగుతోందని తెలియగానే కొంతమంది గర్భిణీ స్త్రీలు అబార్షన్లకి వెంపర్లాడే వికృత చేష్టలకి పాల్పడ్డం జరుగుతున్న విషయమే. ఇలా ఎందుకు జరుగుతోంది అని ప్రశ్నించుకుంటే అనేక కారణాలు ముఖ్యంగా ఆర్థిక కారణాలే ఎక్కువ.

పశు జాతి విషయంలో మాత్రం ఇంకా అంత వికృతమైన చేతలు - మార్పులు ఇంకా రాలేదు. అందుకే ఒక విధంగా ఆ మూగ జీవి ఈ వికృత చేష్టల నుండి బయట పడింది అని చెప్పవచ్చు.

స్త్రీ గర్భంలో పెరుగుతున్న పిండంలో ఏవైనా లోపాలున్నాయా? అని తెలియడానికి జరుపుతున్న స్కానింగు ప్రక్రియ చివరికి వికృత కార్యంగా మారి ఆడ సంతానం పుట్టుకకే శాపంగా మారింది.

అప్పలస్వామి భార్య ఆవు పొట్ట నెమ్మదిగా చేత్తో నిమురుతోంది. ఆ మూగజీవికి బాధ కొద్దిగా తగ్గినట్టు చేయడానికి. అయితే ఆ బాధ తగ్గిపోదు కాని తన యజమానురాలు తనకి సహాయపడుతోంది అన్న తృప్తి లాంటి భావం ఆ మూగజీవి కళ్ళలో తొణికిసలాడింది.

పాలు తీసుకుని సత్యమూర్తి ఇంటికి వచ్చాడే కాని ఆలోచన్లు అన్నీ తెల్లావు చుట్టూనే తిరుగుతున్నాయి.

పాపం ఆ తెల్లావుకి ప్రసవం అయిందో లేదో ? అప్పలస్వామి వాళ్ళు మూర్ఖులు గాని పశు వైద్యుడ్ని తీసుకురావద్దూ? ఇదంతా సహజమే అన్నట్టు ఎంత నిబ్బరంగా ఉన్నారు అనుకున్నాడాయన. ఎలాగో అలాగ సాయంత్రం అయింది. ఆ సాయంత్ర సమయంలో తిరిగి పాలకి గిన్ని పట్టుకుని సత్యమూర్తి అప్పలస్వామి ఇంటికి బయలుదేరాడు.

"కోడెదూడ పుట్టినాది బాబూ! అదే ఆడ దూడయితే సానా బాగుండేది" అన్నాడు అప్పలస్వామి.

"ఏదో ఒక దూడ. ఆ మూగజీవికి బాధపోయింది. అదే పదివేలు. పాపం ఆ మూగ జీవి ఎంత బాధ పడిపోయింది?" అన్నాడు సత్యమూర్తి.

"నిజమే ! అయితే ఆడ దూడయితే ముందు ముందు మాకు సానా ఉపయోగపడేది" అన్నాడు అప్పలస్వామి.

సత్యమూర్తి తెల్లావు వైపు చూసాడు. ఆ మూగజీవి కళ్ళల్లో ఎంతో సంతోషం, ఆనందం. ఇంతవరకూ తను అనుభవించిన వేదన మరచిపోయింది. దూడ శరీరాన్ని ఆప్యాయతగా నాకుతోంది.

ఆ చిన్నారి దూడ తన తల్లి చుట్టూరా తిరుగుతోంది. గంతులేస్తోంది. పడ్తూలేస్తోంది. ఆవు దూడకి, అప్పుడే పుట్టిన వెంటనే నిలబడగలదు. నడవగలదు. అదే శిశువయితే సంవత్సరం అయితే కాని ఆ కార్యక్రమాలు చేయలేదు.

"బాబూ! చిన్నమ్మ గారికి పురుడు వచ్చిన తరువాత జున్ను తినకూడదు. ఇప్పుడు తినొచ్చు. జున్ను పాలు ఇత్తాను వొట్టికెల్లి జున్ను వొండి తినిపించండి అన్నాడు అప్పలస్వామి.

"వద్దు అప్పలస్వామి ! ఈ సమయంలో ఆ ముర్రుపాలు దూడకి ఎంతో అవసరం. దూడ ఆరోగ్యంగా ఉండాలంటే పుట్టిన వెంటనే ఆ ముర్రుపాలు త్రాగించడం మంచిది. అందుకు ఆ పాలు దూడ చేత త్రాగించు" అన్నాడు సత్యమూర్తి.

తను అలా అన్నాడు కాని అప్పలస్వామి ఆ జున్నుపాలు దూడకి త్రాగిస్తాడన్న నమ్మకం సత్యమూర్తికి లేదు. ఎందుకంటే అప్పలస్వామి అసలే డబ్బుమనిషి. దానికి తోడు పాలవ్యాపారి. రోజూ పాలలో నీళ్ళు కలిపి అమ్ముతున్నప్పుడు జున్ను పాలను వదిలిపెడ్తాడా? ఆ పాలలో కూడా నీళ్ళు కలిపి నాలిగింతల ధరకి అమ్ముతాడు.

నిద్రకి ఉపక్రమించ బోతున్న అతని మది నిండా రకరకాల ఆలోచన్లు. నాలుగు సంవత్సరాల క్రితం తను టౌనులో ఉండేవాడు. టవునికి సమీపంలో ఉన్న గ్రామం ఇప్పుడు టవునుని మించిపోయింది కాని అప్పుడయితే జన సంచారం తక్కువగా ఉండేది. తను అక్కడ స్థలం కొనుక్కుని ఇల్లు కట్టుకుని నివాసం ఉంటున్నాడు.

పగలల్లా పరవాలేదు కాని రాత్రి సమయంలో మాత్రం అక్కడ చాలా ఇబ్బందిగా ఉండేది. రాత్రి సమయంలో అర్జంటుగా ఏ హాస్పటల్‌కి వెళ్ళవల్సి వచ్చినా వెహికల్సు ఏవీ దొరికేవి కావు.

అయితే ప్రభుత్వం వన్‌జీరోఫైవ్, వన్‌జీరోఫోరు, వాహనాల సదుపాయం కలిగించడం వల్ల తనలాంటి వాళ్ళకి ఎంతో ఉపయోగపడ్డాయి ఆ వాహనాలు.

తన కూతురు జానకి మొదటి పురుటికి తను ప్రభుత్వ వాహనాలకి ఫోను చేయగానే అవి వచ్చి తన ఇంటి ముందు నిల్చాయి. జానకిని సకాలంలో హాస్పటల్‌లో చేర్పించాడు. అటువంటి సదుపాయమే లేకపోతే తనెంత ఇబ్బంది పడిపోయేవాడో?

కూతురు అత్తవారు ఆ ఊర్లోనే ఉన్నారు. తను కబురు పంపినా వాళ్ళు రాలేదు. చూడలేదు. పైపెచ్చు మీరు అలాంటి వాహనాల్లో మాకోడల్ని హాస్పటల్‌కి తీసుకు వెళ్ళడం మాకు నచ్చలేదు. అలాంటి వాహనాల్లో నానారకాల రోగుల్ని తీసుకు వెళ్తూ ఉంటారు. శుభమని పురుటికి అలాంటి వాహనాల్లో తీసుకెళ్ళడం మాకు ఇష్టంలేదు" అని వియ్యపురాలు గొణిగింది.



తనకి వాళ్ళ చాదస్తపు మాటలు నచ్చలేదు. వాళ్ళకి ఏం సమాధానమియ్యకుండా మౌనంగా ఉండి పోవడం తప్ప మరో మార్గం లేదనిపించింది. అలాగే చేశాడు తను.

ఆ సమయంలో ఆ వాహన సదుపాయమే లేకపోతే తమ పరిస్థితి ఎలా ఉండేదో ఆలోచించడానికే ఇప్పుడు చాలా భయమేస్తోంది. "ఇలా ఆలోచన్లతో ఎంత సమయమయిందో తెలియదు. "అమ్మాయికి చికాగ్గా ఉంది. హాస్పటల్‌కి తీసుకువెళ్ళాలి. వాహనానికి ఫోను చేయండి అంది సత్యమూర్తి భార్య. అతను ఫోను చేసిన వెంటనే ఆ ప్రభుత్వ వాహనం ఇంటి ముంగిట వచ్చి నిల్చుంది.

మనమరాలు నిద్రపోతోంది. భార్యకి తగిన డైరెక్షను - సూచనలు ఇచ్చి భార్యని, కూతుర్ని హాస్పటల్‌కి పంపాడు సత్యమూర్తి.

అవసరమైన బట్టలూ - వస్తువులూ తీసుకుని అతని భార్య హాస్పటల్‌కి బయలుదేరుతూ "మీకు ఫోను చేస్తూ ఉంటాను. ఉదయం ఇంటికి తాళాలు వేసి మనమరాల్ని తీసుకుని వచ్చేయండి హాస్పటల్‌కి" అంది.

"అలాగే"! అని తలూపాడు. వాహనం వెళ్ళిన తరువాత కంటికి కనిపించని ఆ భగవంతుడ్ని తలుచుకుని జానకికి ఏ కష్టమూ లేకుండా సుఖ ప్రసవం చేయమని ప్రార్థించాడు.

ఇప్పుడు ఇటు కార్పొరేట్ హాస్పటల్‌లో అయితేనేమి, ప్రభుత్వ హాస్పటల్‌లో అయితే నేమీ అన్నీ వ్యాపార కేంద్రాలుగా మారిపోయాయి. ప్రతీదీ వ్యాపారమే. చివరికి ఈ ప్రసవాలు కూడా ఆ వ్యాపార ధోరణి విడిచిపెట్టలేదు.

ఈ వ్యాపార కేంద్రాలకి ఎరలు ఈ గర్భిణీ స్త్రీలు. లింగ నిర్ధారణ పరీక్షలు చేసి గర్భంలో ఉన్నది ఆడపిల్లయితే భ్రూణ హత్యలకి పాల్పడుతున్నారు. ఈ హాస్పటల్‌లో పనిచేస్తున్న కొంతమంది.

గర్భంలో ఉన్న పిండం ఎదుగుదల సక్రమంగా ఉందోలేదో అని తెలుసుకునే ఈ పరీక్షలు ఆడ శిశువుల్ని అంతం చేసే వక్ర మార్గానికి దారి తీసాయి. నేడు సమాజం పరిస్థితి అలా మారిపోయింది.

వారసుడు కావాలన్న మిషతో కొందరు - ముందు ముందు ఆడపిల్ల భారం అని మరికొందరు ఇలా సమాజంలో ఈ వికృతపు చర్యలకి పాల్పడుతున్నారు.

వరకట్నం చావులు ఎక్కువవుతున్నాయి. 'జనాభాలో స్త్రీల శాతం అలాగే అక్షరాస్యులలో మహిళల శాతం తగ్గిపోతోంది. కొన్ని కుటుంబాలలో ఆడపిల్లల్ని చదివించడానికి తల్లిదండ్రులు ఇష్టపట్టంలేదు.

స్కూళ్ళలో కూడా ఆడపిల్లలకి భద్రత లేదు. అభద్రతాభావం వెంటాడుతోంది. టీచర్లలో కొందరు కీచకులున్నారు. ప్రపంచం మొత్తం మీద జరిగే బాల్య వివాహాల్లో నలభై శాతం మనదేశంలోనే జరుగుతున్నాయి.

పూర్వకాలంలో కూడా స్త్రీ పరిస్థితి చెప్పుకోదగ్గ విధంగా అంత సంతోషకరంగా లేదు. పూర్వం భర్త మరణిస్తే స్త్రీకి జీవించడానికి హక్కులేదు అనేటట్టు ప్రవర్తించేవారు. కొన్ని వర్గాలలో భర్త శవంతోపాటు, చితిలోకి బలవంతంగా త్రోసేసి సజీవ దహనం తంతు కానిచ్చేవారు. కొన్ని వర్గాలలో ఈ తంతు నిర్బంధం కాకపోయినా భర్త చనిపోయిన ఆడదానికి ఏ సుఖానికి, గౌరవానికి అర్హత ఉండేది కాదు. పునర్వివాహ ప్రసక్తే లేదు. పురుషుడికి ఉన్నట్లు.

అలాంటి విధవరాలికి సమాజంలో బొట్టూ-కాటుకా, పువ్వులూ, గాజులూ అన్నీ నిషిద్ధమే. కొంతమంది సంఘ సంస్కర్తల కృషి ఫలితంగా స్త్రీ మనుగడలో మార్పు వచ్చింది కాని లేకపోతే భర్త చనిపోతే స్త్రీ పరిస్థితి సమాజంలో చాలా హీనంగా ఉండేది. ఈనాడు అంత హీన పరిస్థితి లేకపోయినా వివక్షత మాత్రం పోలేదు.

ఆడదానికి ఆడదే శత్రువు నేడు టీ.వి ప్రసారాల్లో కూడా ఆడవిలన్లు చేసే వికృత చేష్టల్తో ఆ కార్యక్రమాలంటేనే విసుగుపుడ్తోంది.

భర్త చనిపోయిన తరువాత పదవ రోజున ఆ స్త్రీని విధవరాలిగా మార్చడానికి ప్రయత్నించే విధవరాలూ స్త్రీయే. ఈ చర్య కొన్ని విద్యాసంస్థల్లో జూనియర్సుని సీనియర్సు ర్యాగింగు చేసే పద్ధతిలో ఉంటుంది.

చట్ట నిషిద్ధమైన లింగ నిర్ధారణ – ఆడశిశువుల భ్రూణహత్యలు జరుగుతుండడానికి కారణం పురుషుడు కాదే స్త్రీయే. ఆడపిల్లేనా పుట్టింది అని కోడల్ని ఈసడించే అత్తగారూ ఆడదే. అబార్షన్‌కి సిద్ధపడే తల్లికూడా ఆడదే. లింగ నిర్ధారణ చేసే డాక్టరు ఆడదే. అబార్షను చేయడానికి సిద్ధపడే డాక్టరు ఆడదే. ఇంటి కోడల్ని కట్నం చాల లేదన్న నెపంతో కిరసనాయిలు పోసి తగలబెడ్తున్న కొన్ని కుటుంబాల్లో కొంతమంది స్త్రీలు ఆడవాళ్ళే.

సమాజంలో ఆడపిల్లలకి అడుగుడునా వివక్షే. కొన్ని కుటుంబాల్లో మగపిల్లవాడికి ఇస్తున్న ప్రాముఖ్యత – సదుపాయాలూ ఆడపిల్లకి కల్పించరు. చివరికి తిండి బట్ట విషయంలో కూడా.

ఆలోచనా ప్రపంచం నుండి బాహ్యాజగత్తులోకి అడుగుపెట్టాడు సత్యమూర్తి.

నేడు హాస్పటళ్ళ తీరు తెన్నులే మారిపోయాయి. వ్యాపారధోరణి పెరిగి పోవడం వల్ల నార్మల్ డెలివరీలను కూడా సిజరిన్‌గా మార్చేస్తున్నారు. ఈ కాలంలో గర్భిణీ స్త్రీలు కూడా ప్రసవ వేదన అనుభవించడానికి ఇష్టపట్టం లేదు. సుఖ ప్రసవాలు కోరుకుంటున్నారు. అందుకే సిజరిన్ ప్రసవాల ప్రాముఖ్యత పెరిగింది.



నార్మల్ డెలివరీ చేయమని చెప్పిన వాళ్ళని పిచ్చి వాళ్ళలా చూస్తున్నారు ఆసుపత్రి సిబ్బంది. నార్మల్ ప్రసవం అయితే ఈ నక్షత్రం మంచిది. ఈ నక్షత్రం శాంతి నక్షత్రం అని శాంతి నక్షత్రానికి హోమాలు, జపాలూ, దాన ధర్మ కార్యక్రమాలు చేయిస్తే కీడు తొలిగిపోతుందని పురోహితులు చెప్పేవారు. శాంతులు చేయించేవారు.

కాలంతో పాటే సమాజంలో నూతన పోకడలు చోటు చేసుకున్నాయి. ఇప్పుడు మంచి నక్షత్రం – మంచి రోజు చూసుకుని గర్భిణీ స్త్రీలు సిజరిన్ చేయించుకుంటున్నారు. అందుకే శిశువులు చాలా మట్టుక్కి మంచి నక్షత్రానికే పుడ్తున్నారు.

ఈ సిజరిన్ ప్రక్రియ వల్ల సహజ ప్రసవాలకి బదులు కృత్రిమ ప్రసవాలు సమాజంలో చోటు చేసుకున్నాయి.

"అంమీరా! మీ అమ్మాయికి సహజ ప్రసవం జరగాలంటారు. అలా అవాలంటే కొంత సమయం పడ్తుంది. కొంత బాధ కూడా అనుభవించాలి. ఏం పరవాలేదు. ఇప్పుడప్పుడే మీ అమ్మాయికి ప్రసవం జరగదు" అన్నారు హాస్పటల్ వాళ్ళు జానకిని పరీక్షించి జాయిను చేసుకున్న తరువాత.

ఇదే విషయం ఫోను ద్వారా తెలియజేసింది సత్యమూర్తి భార్య అతనికి. హాస్పటల్ వాళ్ళ మాటల్లో తనకి వ్యంగ్యం అగుపించింది. తన కూతురు మొదటి ప్రసవం సమయంలో తాము సిజరిన్‌కి అంగీకరించలేదు. నార్మల్ డెలివరీకి ప్రయత్నించమన్నారు. తప్పని పరిస్థితుల్లో ఎలాగూ తప్పదని అన్నారు.

రోజున్నర బాధ అనుభవించిన తరువాత కాని జానకికి మొదటి పర్యాయం ప్రసవం అవలేదు. ఈ పర్యాయం అంతే అని హాస్పటల్ వాళ్ళు వ్యంగ్యంగా మాట్లాడేరు అనుకున్నాడు సత్యమూర్తి.

హాస్పటల్ వాళ్ళకి డబ్బు కావాలి. ముఖ్యంగా డబ్బు కోసం వాళ్ళు సిజరిన్‌కి ప్రాముఖ్యత ఇస్తూ ఉంటే బాధకి ఓర్చుకో లేని గర్భిణీ స్త్రీలు – స్తోమత ఉన్న వాళ్ళు – సమస్యలున్నవాళ్ళు ఈ సిజరియన్‌కి అంగీకరిస్తున్నారు.

ఉదయం మనుమరాల్ని తీసుకుని హాస్పటల్‌కి వెళ్ళాడు సత్యమూర్తి. అల్లుడు ఆఫీసు పనిమీద క్యాంపులో ఉన్నాడు. అందుచేత రాలేకపోయాడు. ఊర్లో ఉండే ఈ పర్యాయంకూడా వియ్యాల వారు రాలేదు.

తన భార్య తప్ప ఎవ్వరూ ఆసరాగా లేరు హాస్పటల్‌లో. బంధువులు, రక్త సంబంధీకులూ చాలామంది ఉన్నారు కాని, ఎవరి సాధక – బాధకాలు వాళ్ళకుంటాయని తను కబురు చేయలేదు. తీరా రమ్మనమని పిలిస్తే రాలేమని వాళ్ళంటే బాధపడవల్సి వస్తుంది. అందుకే ఎవరికీ కబురు పెట్టలేదు తను.

సాయంత్రానికి కాని ప్రసవం అవదని హాస్పటల్ వాళ్ళు చెప్పేరు. "ఇంటికి వెళ్ళి వంటచేసి భోజనం మీకు – అమ్మాయికి తెస్తాను. మీరు అమ్మాయి దగ్గర ఉండండి" అంది సత్యమూర్తి భార్య అతనితో" సరే! అన్నాడు అతను. భార్య మనమరాల్ని తీసుకుని ఇంటికి బయలుదేరింది.

కూతురు ప్రసవ వేదన చూడలేక పోతున్నాడు ఆ తండ్రి. ఇటువంటి సమయాల్లో ఆడవాళ్ళు ఆసరాగా ఉండాలి అయితే అది వీలు పడలేదు. "నడుం నొప్పితో విలవిల్లాడుతోంది జానకి. మూల్గుతోంది. నొప్పికి చిన్నగా అరుస్తోంది. "అమ్మా! నడుం రాసేదా?" అన్నాడు ఆ తండ్రి కూతురితో. తండ్రి చేత, అదీ మగాళ్ళ చేత అటువంటి పని చేయించుకోవడం మంచిది కాదు – భావ్యం అంతకన్నా కాదు అన్న ఆలోచన విడిచిపెట్టిన ఆ కూతురు అలాగే అన్నట్టు తలూపింది – ఆ తండ్రి కూతురు నడుం రాస్తున్నాడు. జానకి చిన్నప్పటి రోజులు. అతనికి జ్ఞప్తికి వచ్చాయి.

కడుపు నొప్పితో కూతురు విలవిల్లాడిపోతే తను అలాగే కూతురి బాధ పోగొట్టడానికి పొట్ట మీద నెమ్మదిగా రాసేవాడు. ఇప్పుడు కూడా ఆ తండ్రి దృష్టిలో తను ఓ తండ్రి, ఆమె తన కూతురు. కూతురి బాధ తండ్రిగా తను చూడలేదు. స్పందిస్తాడు. ఓ తండ్రిగా అంతేకాని ఆ పనిచేయకూడదని – అనుచితమని అతనికి ఆ సమయంలో అనిపించలేదు.

## కవిత

# లోపం



- కొడుకుల సూర్య సుబ్రహ్మణ్యం
9492457262

ఆకలి బాధ తప్ప
ధనదాహం లేదతనికి !
పూట గడిస్తే
చాలనుకుంటాడే తప్ప
బ్యాంక్ బేలన్స్‌ల
ఊసేలేదతనికి !
తనవాళ్ళ ముఖాల్లో
కొత్త వెలుగు
చూడాలనుకుంటాడే తప్ప
కాంతుల భవంతుల్లో
నివాసముండాలనుండదతనికి !
నలుగురిలో మమేకమై
సదరు మనుషుల్లో
తనూ ఒక మనిషిగా
మిగిలిపోవాలనుకుంటాడే తప్ప
తనకంటూ ఒక ప్రత్యేకమైన
హోదా కల్పించుకోవాలని
ససేమిరా ఉండదతనికి !
తివాచీలపై నడవాలనో
కార్లల్లో తిరగాలనో
విమానాలలో విహరించాలనో
కోట్లకు పడగలెత్తాలనో
అపురూప వస్తుజాలాన్ని
కొనుగోలు చేయాలనో
దొంగతనమో.. దొరతనమో
ఆ ఊసులే ఉండవతనికి !
అలాంటి నిరుపేద కుటుంబీకులంటే
సంపన్న వర్గాలకెందుకో
అంతచులకన ! పైగా అవహేళన !
లోపం దృక్పథంలోనే సుమా !

---



నర్సు లోవలికి వచ్చింది. అతను లేచి నుంచున్నాడు. అతని పరిస్థితి అర్థం చేసుకుంది నర్సు. ఇలాంటి సమయంలో ఈ అమ్మాయి దగ్గర ఆడవాళ్ళెవరైనా ఉండాలి సార్ ! ఈ సమయంలో మగవాళ్ళేం చేయగలరు? అంది నర్సు.

తన పరిస్థితి వివరించాడు సత్యమూర్తి. జాలి గుండె గల నర్సు స్పందించింది. పోనీలెండి నేను మీ ఆవిడ వచ్చేవరకూ ఉంటాను ఇక్కడ" అంది.

"అమ్మాయి చాలా వీక్‌గా ఉంది. అంతేకాక దగ్గర కాన్పుకూడా పెయిన్సు సరిగా రావటం లేదు. చూసి సెలేన్ ఎక్కించాలి. నొప్పులు రావడానికి" అన్నారు హాస్పటల్ వాళ్ళు సాయంత్రం.

సాయంత్రం అయిదుగంటలయింది. సత్యమూర్తి హాస్పటల్ బయట చెట్టుక్రింద కూర్చున్నాడు. నీరసంగా ఉంది. బాగా ఆకలి వేస్తోంది. మధ్యాహ్నం భార్య భోజనం తెచ్చింది కాని తనకి భోజనం హితవు కాలేదు. తినబుద్ధి వేయలేదు. కూతురి పరిస్థితి అలా ఉంటే తనకి ఎలా తినబుద్ధి వేస్తుంది భోజనాన్ని.

"ఆడపిల్ల పుట్టింది. బయటకు వచ్చి అతని భార్య చెప్పింది. "ఏదో పిల్ల. ఈ కాలంలో ఆడయినా - మగయినా ఒక్కటే. ఈ భ్రూణ హత్యల వల్ల ఆడపిల్లల సంఖ్య దేశంలో తగ్గిపోయింది. మగపిల్లల సంఖ్య పెరిగిపోతోంది. నిష్పత్తులు తారుమారు అవుతున్నాయి. ఇలాగయితే సమాజంలో విషమ పరిస్థితులు తలెత్తుతున్నాయి. మానభంగాలు - కిడ్నాపులు పెరిగిపోతున్నాయి. ఆడదానికి భద్రత కరువవుతోంది. అభద్రతాభావం చోటు చేసుకుంటోంది. ఆడపిల్లల సంఖ్య తగ్గిపోవడం వల్ల పెళ్ళి కాకుండా బ్రహ్మచారులుగా మగవాళ్ళు మిగిలిపోతున్నారు.

రాను రాను సమాజ పరిస్థితి ఎలా మారిపోతోందంటే ఒక స్త్రీకి ఇద్దరు భర్తలు ఉండే పరిస్థితి వస్తుంది. ఆటవిక సంస్కృతి తిరిగి సమాజంలో చోటు చేసుకుంటుంది. ఇలా ఆడపిల్లల సంఖ్య తగ్గిపోవడం సమాజ వినాశానికే దారితీస్తుంది. అనుకున్నాడు సత్యమూర్తి మనస్సులో.

తను ఇలా ఆలోచిస్తున్నాడు కాని తమ వియ్యాలవారు మాత్రం అలా ఆలోచించడం లేదే ! తను అనుకున్నట్టే అయింది. "మళ్ళీ ఆడపిల్ల పుట్టిందా? మగపిల్లవాడు ఈ పర్యాయం పుడతాడనుకున్నాం. వియ్యపురాలి మాటలు అవతల జానకికి - ఇవతల సత్యమూర్తి దంపతులకి బాధ కలిగించాయి. ఆడది అలా అని అంటే అనచ్చు. మగవాడు వియ్యంకుడు కూడా "అవును వారసుడు పుడతాడనుకున్నాం" అని గొణిగాడు.

వియ్యాల వారు ఇలా అంటారు అని అనుకున్న సత్యమూర్తి ఆశ్చర్యపోలేదు. అప్పలస్వామి మాటలు వెంటనే గుర్తుకొచ్చాయి.

ఆడదూడ పుట్టలేదని అప్పలస్వామి ఆలోచిస్తూ ఉంటే. వారసుడు పుట్టలేదని వియ్యాలవారు విచారిస్తున్నారు. అక్కడ అప్పలస్వామికి ఆడదూడ కావాలి. ఆడదూడ పుట్టలేదని అప్పలస్వామి విచారిస్తున్నాడు. అప్పలస్వామికి ఆడదూడ అవసరమయితే వియ్యాలవారికి వారసుడు అవసరం. పరిస్థితుల్లో ఎంత వ్యత్యాసం" ఇలా ఆలోచిస్తున్నాడు సత్యమూర్తి.



కవిత

# ఆవిష్కరణోత్సవం

- గోపగాని రవీందర్
9440979882

మదిలోని ఆలోచనల తరాంగాలకు
అక్షరీకరణ రూపమే పుస్తకం.
దాని ఆవిష్కరణోత్సవ దృశ్యమొక
చెరగని సంతకం
ఒక రసవత్తరమైన మాట
ఒక సొగసైన వచనం
ఒక సామాజిక విశ్లేషణ
నాకొక ఉత్తేజపు పులకరింత.

ఒక వక్త మాటలు
మరో వక్తకు ఊపిరినిస్తాయి
ఒక అతిథి ప్రశంస
మరొకరి వస్తువై ఊపునిస్తాయి
కొందరికి కలయికలు
కొందరి పలకరింతలు
మరెందరికో స్ఫూర్తినిస్తాయి.

ఇక్కడ చర్చలు
కథమీదో, కవితమీదో, విమర్శమీదో,
నాటకంమీదో, వ్యాసంమీదో కావచ్చు
ఏదైనా కానీ పలువురు కూడి
మాటలతో కలబడడానికి, కలవడానికి వేదికది
సహృదయాలతో వచ్చిన వాళ్ళు
కుర్చీలకే అతుక్కుపోయారు
తరగతిలోకి విద్యార్థుల్లా.



నాకు తెలియని మరోకోణంలో
అన్వేషిస్తూ సాహితీ శోధకుడనౌతాను
కొన్ని భావాలు విరిసిన మల్లెలై
హృదయమంతా ఆవరిస్తాయి
కొన్ని మాటలు గుభాలించే గులాబీలై
సమ్మోనపరుస్తాయి
కొన్ని ప్రసంగాలు ఎరుపెక్కిన మోదుగుపూలై
కళ్ళల్లో ప్రతిఫలిస్తాయి.
వెయ్యి ఆలోచనలు సంఘర్షిస్తూ
నూరు పూలు వికసిస్తు సభ సాగుతుంది.

సిద్ధాంతాల చిక్కుముళ్ళను విప్పే
సత్యాన్వేషకుణి పలుకులు వింటాను
ఆచరణతోనే మానవ వికాసం సాధ్యమనే
సామాజిక పరిశోధకుడి కఠోరావాణిని వింటాను
జీవనయానాన్ని తన గొంతు మాధుర్యంతో
దృశ్యమానం చేసే గాయకుని గానాన్ని వింటాను
ఒక పొత్తం అందించే అపార జ్ఞానాన్ని
అందుకునే అరుదైనా క్షణాల్ని భద్రపర్చుకుంటాను.

సాహితి సేద్యంలో తలపండిన వాళ్ళను
సారస్వతంపైన మక్కువ పెంచుకున్న వాళ్ళను
రచనల జల్లులను కురిపించే కలం యోధులను
అతి దగ్గరగా చూసి కెరటంలా ఉప్పొంగుతాను

ఇట్లాంటి
ఒక సృజనోత్సవ సమూహం
ఎక్కడ జరుగుతున్న
పుత్రోత్సహాన్ని మించిన సంబరంతో
పాల్గొనే అక్షర ప్రేమికుణ్ణి.

# స్వయంకృతం

- ఎస్.ఎస్.బి.గేరా
9492922492

చంకనెక్కి చందమామను చూస్తూ
గోరుముద్దలు తిన్నప్పుడు, చిన్నప్పుడు
అన్నమంటే
అమ్మరూపమే, అమృతరూపమే!
చంకదిగి, చేలోకి నడిచి
ముఖాముఖి మట్టితో పోరాడినప్పుడు, పొర్లాడినప్పుడు
తెలిసింది
అన్నం పరబ్రహ్మ స్వరూపమని, అపురూపమని!
సొంత పైత్యమెక్కువై, స్వయంకృతమై
సహజత్వం దూరమైనప్పుడు, సర్వం నిస్సారమైనప్పుడు
ఇప్పుడర్థమౌతోంది,
అన్నం విషమైందని, ఔషధం అన్నమౌతోందని !!



కవిత

# అస్తిత్వం కోసం

- ఆవుల వెంకటేశులు
9441665095



అంతా తానై ఊరేగుతున్న నయవంచక మేధ రగిలించిన
అహంకార అణుబాంబుల పెనుమంటల కుంపటిని మోయలేక
గరళవలయమైన భూగోళం దగ్ధమైన ఒంటిని
పొంగిన అశ్రువుల జల్లులతో తడుపుకుంటూ
చావు బతుకుల సంధ్యలో కదలలేని అస్థి పంజరంలా
శిధిల వర్తమానం సమాధి రోదిస్తోంది గుండెలవిసిపోయేలా!

ఖడ్గాల పెదాలపై చిరునవ్వుల్ని పులుముకొన్న
శ్వేత భూతం కర్కశంగా కురిపించిన
అణు జ్వాలల కరవాలాల వేటుకు
తెగిపడిన తలల్ని కూలిన దేహాల్ని ఒడిలో దాచుకొని
కన్న పేగు మరణాన్ని జీర్ణించుకోలేని తల్లిలా
చిట్లిన కలల మధ్య చావని ఆశలతో
విలపిస్తోంది భూమాత దిక్కులు పిక్కటిల్లేలా !

నియంత క్రౌర్యాన్ని దవళ వేషంలో దోపుకొని
కుయుక్తుల వ్యాపారపుటెత్తుల వలల్ని విసరి
నజరానాల చిరుజల్లుల్ని కురిపించి వలసమేధల
పొలాల్లో అణ్వాయుధాల్ని పండించి
ఆకాశ వీధులలో వరుసలు పేర్చి
పూనకం వచ్చిన ఉన్మాదిలా గళం విప్పిన దేశాలకు గురిపెట్టి
తూటాల వర్షం కురిపిస్తుంటే ఉప్పెన మంటల్లో చిక్కిన
ఎండుటాకులా గతస్మృతులను ఎత్తుకొంటోంది
పుడమితల్లి చివికిన దోసిళ్ళతో.

మానవ మనుగడను నిప్పుల నదిలోకి తోసి
బతికున్న మానవీయతను సమాధిచేసి
నోరులేని రాజ్యాల కుత్తుకలను తెగనరికి
వెర్రెత్తిన నరహంతుకునిలా రుధిర సంపదల్ని జుర్రుకుంటూన్న
హిట్లర్ కబేళాలో కాళ్ళుతెగిన ఒంటెలా
ఆక్రోశిస్తోంది అవని అస్తిత్వం కోసం.

నచ్చిన రచన

# మానవ బంధాల 'చిరునామా'


జాతశ్రీ

ఇందిర

7396303552

కథకులుగా జాతశ్రీ తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని, ముద్రను నిలబెట్టుకున్నవారు. పాలకుల విధానాల వలన గ్రామీణ వృత్తి వ్యవస్థ చిన్నాభిన్నమైన తీరు వీరి కథల్లో కళ్ళకు కడుతుంది. అభద్రతా భావంతో చావలేక బ్రతుకుతున్న - బ్రతకలేక చస్తున్న నేతన్నల దీనావస్థకు చిత్రిక పట్టిన కథ 'చిరునామా' ప్రభుత్వం వారికిచ్చే వరాలు, చేసే వాగ్దానాలు, పరామర్శలు అన్నీ రాజకీయమని, బూటకాలు - నాటకాలని, చేతలకు ఊతమివ్వని మాటలు ఇంకా ఎంతకాలమని రచయిత ఆక్రోశం ఈ కథలో వినబడుతుంది.

నేతన్నల కుటుంబంలో పుట్టిన వ్యక్తి ముక్కంటి. నేతబతుకు చితికిపోగా బ్రతుకు తెరువుకై 'భీవండి' వెళతాడు, నాలుగైదు సంవత్సరాలుగా ఏవేవో పనులు చేస్తూ భీవండిలోనే ఉంటాడు. ఉండనైతే ఉంటాడు గానీ అతని మనసు మనసులో ఉండదు, ఏవేవో పీడకలలు వస్తుంటాయి. తల్లి గుర్తొస్తుంటుంది. ఊరికి వెళ్లాలని హఠాత్తుగా నిర్ణయించుకుంటాడు. మిత్రునితో ఒకమాట చెప్పి స్వంత ఊరికి బయలుదేరతాడు. ఊళ్లో తల్లి పరిస్థితి చూసి చలించిపోతాడు. అయినవాళ్లందరికీ దూరంగా బ్రతుకుతూ తాను కోల్పోతున్నదేమిటో అతనికి తెలుస్తుంది. కథ చివర్లో మళ్లీ తాను భీవండీ వెళ్లాలా? వద్దా అంటూ ముక్కంటి ప్రశ్నిస్తాడు.

కథ ముగింపు ప్రశ్నార్థకమైనా, ముక్కంటి నిర్ణయాన్ని మనకు చెప్పకనే చెబుతుంది. అతడు వెళ్లకుండా ఉండడానికే మొగ్గుచూపిస్తున్నాడని తెలుస్తుంది. అలా స్ఫురింపజేయడం జాతశ్రీ కథన చాతుర్యమే ! కథ మొత్తం ముక్కంటి భీవండి వెళ్లడానికి ముందు - తల్లిని చూడాలని మనసు లాగి మళ్లీ వచ్చిన తర్వాతి సంభాషణలతోనే నడుస్తుంది. వర్ణనల కంటే సంభాషణలతోనే కథను రక్తి కట్టించారు రచయిత. ఉన్నదో-లేనిదో తిని అందరం కలిసి ఊళ్లోనే బ్రతుకుదామంటుంది తల్లి. ఆమె ఎన్ని విధాల ప్రాధేయపడినా వినకుండా 'భీవండీ' వెళ్లిన ముక్కంటి, అక్కడి రంగు - రుచి లేని యాంత్రిక జీవితం పట్ల విరక్తి చెందుతాడు. ఉన్న ఊరు, కన్నతల్లి, తోబుట్టువులు అతనికి మరీ-మరీ గుర్తొచ్చి మనసు వికలమై హఠాత్తుగా ఊరికి తిరిగి వస్తాడు. అతని అంతరాంతరాల్లో అనుబంధాల పట్ల ఉన్న మమకారం ఊర్లోని బాల్య మిత్రుడు పెంటయ్యను కలసి మాట్లాడినపుడు బహిర్గతమవుతుంది.

'భీవండీ బతుకెట్టుంది? గిట్టుబాటవుతుందా?' అన్న పెంటయ్య ప్రశ్నకు ముక్కంటి సమాధానం చూడండి...గిట్టుబాటంటే..? అవునంటే-అవును కాదంటే-కాదు' అంటూ ఇదమిద్ధంగా చెప్పలేకపోతాడు. 'ఏదైనా మనవనుకోవడంలోనే ఉంది గదరా' అని, ఇంకా నేనాడ నాలుగు డబ్బులు కళ్లజూస్తే, నువ్వీడ నలుగురి పలకరింపులతో పులకించి పోతున్నవ్ ! దేనికవే గిట్టుబాటు' అంటూ తేల్చిపారేస్తాడు.

పలుకరించే వాళ్లులేక ఏడ్చేవాళ్ల గురించి నలుగురి మధ్య ఉన్న పెంటయ్యకు ఏం తెలుస్తుంది ఆ విలువ అంటాడు. దారి లో తారసపడ్డ పెంటయ్య, తాత, మామ అందరూ తనను పట్నం గాలిసోకి అనుబంధాలను, చుట్టరికాలను మర్చిపోయినవాడి కింద జమకట్టినపుడు ముక్కంటి విలవిలలాడిపోతాడు. పెంటయ్యతో మాట్లాడిన తర్వాత ముక్కంటి ఆలోచనలు చూస్తే అతడు భీవండీ వెళ్లి డబ్బు సంపాదించిన దానికంటే, పల్లెలోని ఆత్మీయాను రాగాలకే ఎక్కువ విలువ ఇస్తున్నాడని అర్థం అవుతుంది. ముక్కంటి ఆలోచనలకు ఊతం ఇస్తున్నట్లుగా అతని మేనమామ సంభాషణలు సాగుతాయి.

ముక్కంటి తల్లి రోగాలపాలై మంచానపడటానికి కారణం 'మనోవ్యాధే' అంటాడతను, గంజో-గటకో తిన్నా అందరూ కలిసి బ్రతకడంలోని ఆనందం డబ్బురోగమంటిన యీ కాలం వాళ్లకు తెలియడం లేదంటాడు. అయిన వాళ్లందరూ కలిసి ఆనందంగా గడపడానికే పండుగలూ-వ్రతాలు, నోములు పెట్టారంటాడు. ఆ సంతోషంతో మనుషులు రోగాల్ని జయించే ఆరోగ్యాన్ని మూటగట్టుకుంటారంటాడు. ముక్కంటి లాంటివారు డబ్బుపిచ్చిలోపడి మానవ సంబంధాలను మర్చిపోయి, చప్పిడి బ్రతుకులు బ్రతుకుతున్నారని అంటాడు.

మామ మాటలతో ముక్కంటిలో డబ్బు-బంధాలలో ఏది ఎక్కువ, ఏది తక్కువ అనే సంఘర్షణ మొదలౌతుంది. ఒక సామాజిక విషాదాన్ని నేపథ్యంగా తీసుకుని మానవ బంధాలలోని తీయదనాన్ని రుచి చూపిస్తారు జాతశ్రీ !పిల్లలపట్ల తల్లికుండే మమకారానికి ఒక్క సంభాషణ చాలు-

'నిన్నొదలి నేనెట్టుండాలిరా' అని తల్లి అంటే,

'....అవుల్ని సూసుకుంట దొర్సానిలెక్కిండు' అని ముక్కంటి

'....మర్నా కడుపున బుట్టిన బిడ్డ యాదిలకొస్తే ఏం జెయ్యనురా'?....

'ఫోన్నెంబరిస్తగా... ఫోన్జెయ్యరాదె' అంటాడు.

'మరినీకాకలయితే నేనేం సెయ్యన్రా! అదేరా, ఫోన్జేత్తే ఆకలి తీరుద్దా' అంటూ కుమిలి కుమిలి ఏడుస్తుంది.

తల్లి గుర్తొచ్చి తటాలున బయలుదేరిన ముక్కంటి మనసులోని అలజడికి రైల్లో తాత మాటలు తోడై మరీ అతన్ని ఆలోచింపజేస్తాయి. '....మన్సికి పైసలొద్దనటంలే గాని, పైసలొక్కటే సాలా?.... బతికిన నాల్రోజులూ నలుగురితో నవ్వుకుంట బతికేది మన్సే... అడివిల మెకం తీర్న దొరికింది తినుకుంట, పీతిరిగద్దలా బతికితే... అది మన్సి వరసేనా?' కాదని తాత వాదన ! ఎండమావుల వెంబడి పరుగులెత్తే వాని మానసిక పరిస్థితిని అడుగడుగునా ఆవిష్కరించిన తీరు అందర్నీ ఆలోచింపజేస్తుంది.

ముక్కంటితో 'భీవండీ వెళ్లాలా? వద్దా? అనిపించి కథ ముగించినా సమాధానం మనకు తెలుస్తుంది. ఏడేళ్ళ క్రితం (2005) రాసిందే అయినా 'చిరునామా' కథలో సమకాలీనత లోపించదు. ఆ దిశగా ఇది నిజంగా ఓ కథారాజం !

# కొత్త పుస్తకాలు

## నేను.. ఎడ్లపాడు.. ఎర్రజెండా



- పోపూరి రామారావు

వెల : రూ.10/- పేజీలు : 136

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు

భారత దేశంలో గల లక్షలాది గ్రామాలలో ఎడ్లపాడు కూడా ఒకటి. అటువంటి గ్రామానికి భావి తరాలకు ఉపయోగపడే చరిత్ర ప్రత్యేకంగా ఏముంటుంది? ఇది ఎడతెగని ప్రశ్నగా కొంతకాలం వేధించింది. గ్రామానికి గల పూర్వ చరిత్రను, పార్టీ చరిత్రను, వ్యక్తుల కృషిని, సాధించిన ఫలితాలను మేళవించి ముందుకెళ్తే ఒక రూపం కల్పించగలను అనిపించి, ఈ కార్యక్రమానికి ఉపక్రమించటం జరిగింది.

- పోపూరి రామారావు

## మంత్రవాది మహేశ్వర్



### 33 కథలు

వెల : రూ. 125/- పేజీలు : 201

ప్రతులకు : 9441420962

రచయిత అంతరంగం తాత్విక భావజాలం శ్రీ మహేశ్వర్ గారి కథలలో సహజంగా ద్యోతకమవుతుంటాయి. కొందరి కథలు చదువుతుంటే వారి వ్యక్తిత్వం, మనసు ఇలాంటిది అని చదువరికొక భావన, ఒక రూపం కూడా అందుతూ ఉంటాయి. అలాంటి స్ఫురణను అందిస్తాయి ఈ కథలు. కథల్లో శిల్పం ఆకుచాటు పిందెలా భాసిస్తుంది. శైలీ అంతే..

పేపర్ బ్యాక్

## జి. నరసింహమూర్తి కథానికలు



జి. నరసింహమూర్తి

వెల : రూ.100/- పేజీలు : 168

ప్రతులకు: 8977987266

ఈ సంపుటిలోని 26 కథానికల్లోనూ వస్తు వైవిధ్యం కనిపిస్తుంది. శిల్ప చాతుర్యం మెరుస్తుంది. సనాతన సాంప్రదాయాల్నీ, కుల మత వర్గ వైషమ్యాలనీ తన అనుభవాల కొత్తకోణంలో చిత్రీకరించిన 'పాతతోవకు కొత్తగమ్యం', 'దేవుడే హంతకుడు', 'దగ్ధజీవితం' లాంటివి ఆయన అభ్యుదయ సాంఘిక సంస్కరణాభిలాషతో పాటు, అవి సమాజానికి మేలుకొలుపు!. కథానికలన్నీ తనదైన కొత్త వస్తువుతో ఆవిష్కరింపబడి నవ్యతతో హృదయాన్ని హత్తుకుంటాయి.

-డా॥ వేదగిరి రాంబాబు

## వేమన



వేమనపై విమర్శ వ్యాసాలు

సి.పి. బ్రౌన్ భాషా పరిశోధన కేంద్రం,

వెల : రూ.160/- పేజీలు : 244

ప్రతులకు: 08562 - 255517

తెలుగు సాహిత్య చరిత్రలో అనేక కోణాలు ఇంకా అపరిష్కృతంగానే ఉన్నాయి. అందులో వేమన జీవితం ఒకటి. ఈ సంకలనంలోని వ్యాసాలలో వేమన జీవితం గురించి కాలం గురించి, స్థలం గురించి, వేమన భావజాలం గురించి, తాత్వికత గురించి అనేక ఆలోచనలు మన ముందుంచుతున్నాయి. ఈ ఆలోచనా వైవిధ్యాన్ని పాఠకుల ముందుంచడమే మా ఉద్దేశం.

ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి

## పదాల పరిమళాలు



విద్యార్థులకు సాహిత్య వ్యాసాలు

రాజా వాసిరెడ్డి మల్లీశ్వరి

వెల : రూ.100/- పేజీలు : 144

ప్రతులకు: 27760723

"సామెతల గురించి కూడా'' సామెతల్లో వాసకెక్కిన ఊళ్ళు సామెతల్లో వ్యతిరేక పదాలు, మనపండగలు సామెతలు, సామెతల్లో లోకరీతి మొదలైన వ్యాసాలు కూర్చారు. అలాగే ఈ వ్యాసాలలో పొడుపు కథల్ని గురించి, 'పాల మురిపాలు'లో పాలను గురించీ చెప్పలేనన్ని చుక్కలు"లో చుక్కల గురించి, మన కోసం కాగితంలో కాగితం గురించి, "చేటు చేసే సోమరితనం"తో సోమరితనం గురించి – ఇలా ఎన్నో విషయాలు "పదాల పరిమళాలలో గుభాళిస్తున్నాయి.

డా॥ రెడ్డి రాఘవయ్య

## మూడు భారతీయ భాషలలో సంచలనం సృష్టించిన తెలుగు నవల



డా॥ వి.ఆర్. రాసాని

వెల : రూ.120/- పేజీలు : 192

ప్రతులకు : 9848443610

వి.ఆర్. రాసాని బసివినులుగా మార్చబడిన ఎందరో స్త్రీల జీవితాలను స్వయంగా పరిశీలించి ఈ నవలను రాశాడు. ఆయన నివసిస్తున్న తిరుపతిలోనూ దాని చుట్టూ వున్న పలు ప్రాంతాల్లోనూ ఈనాటికీ బసివినులుగా ముద్ర పడిన స్త్రీలెందరో ఉన్నారని తను వాళ్ళతో మాట్లాడి, వాళ్ళ జీవితాలను క్షుణ్ణంగా పరిశీలించాకే తనీ నవలను రచించానని వి.ఆర్. రాసాని నాకు చెప్పాడు. ఈ కారణం చేతనే ఈ ముద్ర నవల ఇంత వాస్తవికంగా, ఇంత బలంగా రూపొందిందని నాకనిపించింది.

అంపశయ్య నవీన్

# కొత్త పుస్తకాలు

## నాగిశెట్టి నానీలు



నాగిశెట్టి

వెల : రూ. 50/- పేజీలు : 43

ప్రతులకు : నాగిశెట్టి

సమకాలీన సమాజంలోని క్లిష్ట పరిస్థితులు ఈ నానీల్లో ప్రతిబింబిస్తున్నాయి. తను పుట్టిన పల్లె, పెరిగిన సమాజం, తనచుట్టూ వున్న స్థితిగతులు ఈ నానీల్లో కన్పిస్తాయి. పల్లెలు, వ్యవసాయం, అవినీతి, ఆడపడుచుల వ్యథలు, ప్రకృతి వినాశనం ఇటువంటి సమస్యలన్నీ కవితా వస్తువులైనాయి. పుట్టి పెరిగిన వాతావరణం బలమైన కవిత్వం రాయడానికి నాగిశెట్టికి తోడ్పడుతోంది.

సోమేపల్లి వెంకట సుబ్బయ్య

## ఇద్దరి మధ్య



కవితా సంపుటి

పలమనేరు బాలాజీ

రూ. 70/- పేజీలు : 140

ప్రతులకు : 9440995010

'ఇద్దరి మధ్య' చదువుతున్నప్పుడు ఎక్కడా కుంటు పడలేదు. నడక దెబ్బతినలేదు - ఒక సమతూకంతో - దానిదయిన సంగీతంతో ఈ కవితలన్నీ నడిచాయి. చాలా ఇంపుగా కనిపించాయి, ధ్వనించాయి - వాటి ముద్రల్ని అవి వదిలిపోతాయి - పుస్తకం చదివి అవతల పెట్టిన తర్వాత కూడా, వాటి స్పర్శ, వాటి ధ్వనులు మనల్ని వీడవు. అవి వాటిదయిన వ్యక్తిత్వంతో బతుకుతాయి -

- కె. శివారెడ్డి

## *TRICOLOUR SHALL FLY OVER HYDERABAD*



**DR. RAJ BAHADUR GOUR**

**Rate : 25/- Pages : 54**

**Ph : 9346689306**

Re-publishing a book of this kind, after sixty years, is of enormous educative value for the present and future generations. In the changed political conditions, as well as the rise of narrow communal and reactionary ideas and movements, it would be enlightening to re-read the history as told by an important actor on the stage of the past.

*- B. Narasing Rao*

## కాలం మరణించింది...!



కవిత్వం

డి. రామచంద్రరాజు

వెల : రూ.150/- పేజీలు : 176

ప్రతులకు : ....................

ప్రస్తుతం కుప్పలు తెప్పలుగా వ్యక్తిత్వ వికాసం పేరిట వస్తున్న పుస్తకం కాదిది. తెలుగు నేలలో ఉద్భవించిన జీవనసారం. అనుభవాల సాగరం. పేదరికంలో పెరిగినవాడు కష్టాల కొలిమిలో జీవితాన్ని రగిలించుకొన్నవాడు నలుగురి తలలో నాలుకలా నిలిచినవాడు ఎన్నో ప్రతికూల పవనాలకు ఎదురొడ్డి సవాలు విసిరినవాడు జీవితాన్ని జయించిన ఒక విజేత అనుభవాల అంతర్వాహిని... ఈ "కాలం మరణించింది..."

- నూకా రాంప్రసాదరెడ్డి

## నోబెల్ తారలు



నోబెల్ బహుమతి గ్రహీతల కథానికలు

ముక్తవరం పార్థసారథి

వెల : రూ. 250/- పేజీలు : 288

ప్రతులకు : 9177618708

అన్నీ బహుమతుల్లాగే, నోబెల్ కూడా, వివాదాలకు అతీతమైనదేమీ కాదు. పలుసార్లు అర్హులకురాలేదన్న ఆరోపణలు ఉన్నాయి. ఉదాహరణకు : సాహిత్యంలో లియోటాల్‌స్టాయ్, ఆంటన్ చెహోవ్, హైన్రిష్ ఇబ్సెన్, థామస్ ఆర్డీ, జోసెఫ్ కోన్రాడ్, మార్క్‌ట్వేన్, మాక్సింగోర్కీ, జేమ్స్ జాయస్, మార్సెల్ ప్రూస్ట్, వర్జినియా వూల్ఫ్, హెచ్.జి.వెల్స్, సామర్సెట్ మాం లు నోబెల్ బహుమతికి అనర్హులనుకున్నారు స్టాక్ హోం అకాడెమీ జడ్జీలు. ఈ కథల నాణ్యత నిర్ణయించాల్సింది మీరే.

- ముక్తవరం పార్థసారథి

## వేడుక పాటలు

పిల్లల కోసం...

డా.వి.ఆర్. రాసాని

వెల : రూ.60/- పేజీలు : 59

ప్రతులకు : ....................................

పల్లెల్లో జరుపుకునే జాతరలు, దేవరలు, పండుగలు, తిరునాళ్ళు వంటి జన బాహుళ్యం చేరే కార్యక్రమాలు, పెండ్లిండ్లు, పేరంటాలు, సమర్తలు, సీమంతాలు వంటివి, అలాగే వెన్నెల రాత్రుల్లో ప్రదర్శించే కోలాటలు, గొబ్బి, జక్కి, చెక్కభజన, కులుకు భజన, పలకల భజన, చిటితాళ భజన వంటి వినోదాలు- ఇవన్నీ వేడుకలే. అలాగే హిందువులు, ముస్లిములు ఏ తారతమ్యాలు లేకుండా పాల్గొనే ఉరుసు ఉత్సవాలు, క్రిస్‌మస్ సంబరాలు వేడుకలే. ఆయా సందర్భాలలో పాడేవన్నీ వేడుక పాటలే. ఈ పుస్తకంలో ఒక్కో వేడుకకు ఒక్కో పాటను ఉదహరించడం జరిగింది

- రాసాని

## నివాళి

# విశిష్ట గాయకుడు పి.బి. శ్రీనివాస్



సినీరంగంలో విశిష్ట గాయకుడిగా పేరొందిన పి. బి. శ్రీనివాస్ ఏప్రిల్ 14న తుది శ్వాస విడిచారు. పి.బి. శ్రీనివాస్ బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆయన అనేక భాషల్లో పాటలు పాడారు. సంస్కృతం, తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లో ప్రావీణ్యం గడించారు. పి.బి. శ్రీనివాస్ సెప్టెంబర్ 22, 1930న తూర్పుగోదావరి జిల్లా, కాకినాడలో జన్మించారు. కాకినాడలో డిగ్రీ వరకు చదువుకున్న పి.బి. శ్రీనివాస్‌కు చిన్నప్పటి నుండి సినీ రంగం పట్ల మక్కువ ఉండేది. అన్ని భాషల సినిమాలు చూడడం, పాటలు విని స్వరాలు రాసుకుని సాధన చేయడం అలవాటు చేసుకున్నారు. అనేక భాషల్లో పాటలు పాడటమే కాకుండా ఉర్దూలో గజల్స్, ఇంగ్లీషులో కవితలు కూడా రాసి మెప్పించారు. నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్రునిపై కాలిడిన సందర్భంలో ఇంగ్లీషులో 'మేన్ హేజ్ సెట్ హిజ్ పూట్ ఆన్ ది మూన్' అనే పాట రాసి కంపోజ్ చేశారు. రవీంద్రనాథ్ శతజయంతి సందర్భంగా శాంతినికేతన్ వారు రవీంద్రనాథ్ టాగూర్‌పై పి.బి. శ్రీనివాస్‌చే కొన్ని పాటలు రికార్డు చేయించుకున్నారు. కొన్నాళ్ళు జర్నలిస్టుగా కూడా పనిచేశారు. 'ఓహో గులాబీ బాలా..', 'నీ అందాల చేతులు కందేను పాపం ఎందుకు ఈ బెడదా' వంటి ఆయన పాడిన మధుర గేయాలు తెలుగునాట సుపరిచితమే. సినీ చరిత్రలో పి.బి. శ్రీనివాస్ తనకంటూ ప్రత్యేక స్థానాన్ని సాధించుకున్నారు.

# ఉగాది జనకవనం



ఏప్రిల్ 10న కర్నూలు సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో విద్యుత్ & అధిక ధరల భారాల అంశంపై జరిగిన జనకవనం

సాహితీ స్రవంతి కర్నూలు జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఏప్రిల్ 10న స్థానిక కార్మిక కర్షక భవన్‌లో ఉగాది సందర్భంగా విద్యుత్ కోతలు, సమకాలీన సంగతులపై ఉగాది కవి సమ్మేళనం జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు పాల్గొన్నారు. సభాధ్యక్షులుగా సాహితీ స్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి కెంగార మోహన్ వ్యవహరించగా కవి సమ్మేళనంలో జిల్లా వ్యాప్తంగా 21 మంది కవులు తమ కవితలు వినిపించారు. ఈ సందర్భంగా రఘుబాబు మాట్లాడుతూ సాహిత్యం సమాజంలో ప్రజల్ని చైతన్య పరిచే బలమైన ఆయుధమన్నారు. సామాజిక స్పృహతో కవిత్వం ప్రజలకు దగ్గరవ్వాలని ఈ బాటలో కవులు, నడవాల్సి వుందన్నారు. సాహిత్య ప్రయోజనం విశ్వజనీనమైందని అన్నారు. సమకాలీన సంగతులను బాగా ఆకళింపు చేసుకొని కవిత్వీకరించి ప్రజలను జాగృతం చేయాలన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి సహాయ కార్యదర్శి పులిచేరి మహేష్, బి.డి. సుధీర్ రాజు నాయకులు నాగమణి, డా॥ బడేసాహెబ్, నరసింహ తదితరులు పాల్గొన్నారు.

# స్ఫూర్తి ప్రదాత అంబేద్కర్

భారతరత్న బాబాసాహెబ్ అంబేద్కర్ 123వ జయంతి సందర్భంగా సాహితీ స్రవంతి అనంతపురం జిల్లా శాఖ ఆధ్వర్యంలో ఏప్రిల్ 14న ఘనంగా నిర్వహించారు. జిల్లా శాఖ అధ్యక్షుడు పిల్లి కుమార్ స్వామి మాట్లాడుతూ అంబేద్కర్ అనుకున్నట్లుగా కులరహిత సమాజం కోసం కలాలతో నిరూపించాలని పిలుపునిచ్చారు. సాహితీ స్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి తగరం కృష్ణయ్య మాట్లాడుతూ భారత రాజ్యాంగ నిర్మాత మంచి రచయిత అని భారతదేశంలో కులాలు : వాటి ఏర్పాటు, పుట్టుక మరియు అభివృద్ధిపై ఎన్నో వ్యాసాలు రచించారని తెలియచేశారు. అనంతరం జిల్లా పరిషత్ కార్యాలయం ఎదురుగా ఉన్న అంబేద్కర్ విగ్రహానికి సాహితీ స్రవంతి సభ్యులు పూలమాలలు వేసి నివాళులర్పించారు. కవులు తమతమ కవితలు విన్పించారు. ఈ కార్యక్రమంలో ఉపాధ్యక్షులు ఎర్రిస్వామి, సహాయ కార్యదర్శి ఆకుల రఘురామయ్య, కమిటీ సభ్యులు డా॥ జెన్నే ఆనందకుమార్, డా॥ సి. శివన్న డా॥ జుటూర్ షరీఫ్, షేక్ రియాజుద్దీన్ అహ్మద్, వెంకటేష్, బి.కె. నారాయణ, ఆలీఖాన్ హూన్నూరప్ప, తిరుపాల్ నాయక్ శేక్నావాలి తదితరులు పాల్గొన్నారు.

### సవరణ

సాహిత్యప్రస్థానం ఏప్రిల్ 2013 సంచిక ముఖచిత్రంపై శ్రీపాద పినాకపాణి ఫొటోకు బదులుగా వేరే ఫొటో వచ్చింది. అదే సంచిక లోపల నివాళి శీర్షికలో ఉన్న శ్రీపాద పినాకపాణి ఫొటోను అసలు ఫొటోగా పాఠకులు గమనించగలరు. పొరబాటుకు చింతిస్తున్నాం.

## డైరీ



మార్కాపురం, శ్రీ సాధన డిగ్రీ కళాశాలలో మార్చి 24న మంత్రి కృష్ణమోహన్ కవితా సంపుటి. 'ప్రవహించే పాదాలు' ఆవిష్కరిస్తున్న డా. పాపినేని శివశంకర్. చిత్రంలో (ఎడమ నుండి కుడికి) ఎస్.ఎ.టి.కె. ఆచార్య పెనుగొండ లక్ష్మీనారాయణ, డా.కప్పగంతుల మధుసూదన్‌లు ఉన్నారు.



ఏప్రిల్ 7న మహబూబ్‌నగర్‌లో లుంబినీ టెక్నోహైస్కూల్‌లో ఆచార్య జన్ను రాఘవులు రచించిన బాలగేయాలు పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న ఆచర్య మసన చెన్నప్ప చిత్రంలో భీంపల్లి శ్రీకాంత్, డిప్యూటి డి.ఇ.ఓ గోవిందరాజులు, జలజం సత్యనారాయణ, కె. లక్ష్మణ్ గౌడ్.



తైదల అంజయ్యకు సుబ్బరావమ్మ గోపాలస్వామి ఫౌండేషన్ కవితా పురస్కారాన్ని అందిస్తున్న పి. శ్రీనివాస్‌గౌడ్. చిత్రంలో అరసవల్లి కృష్ణ, వడలి రాధాకృష్ణ, బి. హనుమారెడ్డి, డా. వి.ఆర్. రాసాని, కె.వి. రమణారెడ్డి ఉన్నారు.



ఏప్రిల్ 8న శ్రీకిరణ్ సాంస్కృతిక సమాఖ్య ఆధ్వర్యంలో శ్రీ త్యాగరాయ గానసభ, హైదరాబాద్ వివిధ రంగాలకు చెందిన ప్రముఖులకు శ్రీ విజయ నామ సంవత్సర ఉగాది పురస్కారాలు పద్మభూషణ్ డా.సి. నారాయణరెడ్డి అందజేశారు. చిత్రంలో సాహితీ పురస్కారాన్ని అందుకుంటున్న కవి రమణ వెలమకన్ని, డా.ఓలేటి పార్వతీశం, డా. కళాదీక్షితులు మరియు డా. చిల్లర భవాని దేవి పాల్గొన్నారు.



మార్చి 9న మల్లయ్య లింగం భవన్ గుంటూరు కొత్తపేటలో "ప్రతిమాసం - రచనకోసం' కార్యక్రమంలో భాగంగా ఈ మాసం 'అమ్మ' అంశంపై జరిగిన కవితా గోష్ఠిలో "మహోజ్వల తేజం అమ్మ" పుస్తకావిష్కరణ చేస్తున్న డిప్యూటి కలెక్టర్ నూర్ భాషా రహంతుల్లా, చిత్రంలో సోమేపల్లి వెంకట సుబ్బయ్య, షేక్ బాజ్జి, సయ్యద్ నశీర్ అహ్మద్, డా. రమణ యశస్వి, డా. వి. నాగరాజ్యలక్ష్మి, ఎస్.ఎం. సుభాని



ఏప్రిల్ 13న నిజామాబాద్‌లోని 'హరిద రచయితల సంఘం' తరపున 'తెలంగాణ విశిష్ట సాహితీ పురస్కారం-2013'ను డా. ఎన్.గోపికి అందిస్తున్న ప్రముఖ చిత్రకారులు కందకుర్తి యాదవరావు. చిత్రంలో రామచంద్రారెడ్డి, డా. నాళేశ్వర శంకరం, నరేందర్ రెడ్డి, ఘనపురం దేవేందర్, బస్వా లక్ష్మీనరసయ్య, రచ్చ మురళి, జి. నర్సింహస్వామి

డైరీ

## సమసమాజ స్వాప్నికుడు సుందరయ్య

ప్రజాస్వామ్య పరిరక్షణ అంటు నేతలు పలికే పలుకులు ప్రగల్భాలేనని, కాని ప్రజాస్వామ్యంలో అసలుసిసలైన ప్రజాస్వామ్యవాది సమసమాజ స్వాప్నికుడు పుచ్చలపల్లి సుందరయ్యేనని వక్తలు అభిప్రాయపడ్డారు. కర్నూలు నగరంలో ఏప్రిల్ 21న ఉదయం కార్మిక, కర్షక భవన్‌లో ప్రజా ఉద్యమ నిర్మాత, ఆదర్శ పార్లమెంటేరియన్ మహా నాయకుడు, స్వతంత్ర్య భారతదేశంలో మొదటి ప్రతిపక్షనేత సుందరయ్య శతజయంతి ఉత్సవాల్లో భాగంగా సాహితీ స్రవంతి యుటిఎఫ్ జిల్లా కమిటీల సంయుక్త ఆధ్వర్యంలో వర్తమాన అంశాలపై కవితా గోష్ఠి నిర్వహించడమైనది. కార్యక్రమానికి సభా అధ్యక్షులుగా యుటిఎఫ్ జిల్లా ప్రధాన కార్యదర్శి కందుకూరి సురేష్ కుమార్ వ్యవహరించగా కవితా గోష్ఠి సమన్వయకర్తగా సాహితీ స్రవంతి జిల్లా కార్యదర్శి కెంగార మోహన్ వ్యవహరించారు. ముఖ్య అతిథిగా ప్రముఖ కథ, నవల రచయిత ఎస్.డి.వి. అజీజ్ పాల్గొనగా వక్తలుగా సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి, యుటిఎఫ్ జిల్లా గౌరవ అధ్యక్షులు ఎన్. నరసింహులు సాహితీ స్రవంతి నంద్యాల డివిజన్ కార్యదర్శి మాదాల శ్రీనివాసులు మాట్లాడారు. ఎస్.డి.వి. అజీజ్ మాట్లాడుతూ సామాజిక స్పృహ కలిగిన కవిత్వం ప్రజల్ని నడిపిస్తుందని కవులు సమకాలీన సమస్యలను ఆకళింపు చేసుకొని రచనలు చేయాలన్నారు. సురేష్ కుమార్ మాట్లాడుతూ సుందరయ్య శతజయంతి ఉత్సవాల్లో భాగంగా కవితా గోష్ఠి నిర్వహించడం ఆనందంగా ఉందని సుందరయ్య త్యాగాలను యువతరానికి అందించాల్సిన అవసరం ఉందన్నారు. కెంగార మోహన్ మాట్లాడుతూ ప్రజల జీవనంతో తన జీవితాన్ని మమేకం చేసుకొని ప్రజా ప్రగతే ధ్యేయంగా కడవరకు ప్రజా సంక్షేమం కోసం పరితపించిన సోషలిస్టు శ్రామికుడు సుందరయ్యని అన్నారు. సుందరయ్య ఆశయాలను ఈనాటి తరం ముఖ్యంగా యువతరం ముందుకు తీసుకెళ్ళాల్సిన బాధ్యత ఉందన్నారు. మాదాల శ్రీనివాసులు మాట్లాడుతూ దేశానికి, దేశ ప్రగతికి సుందరయ్య చేసిన సూచనలు, ప్రణాళికలు అమూల్యమైనవని నేటి ఆర్థిక విధానాలను ఆనాడే గమనించి వ్యతిరేకించిన గొప్ప దూరదృష్టి కలిగిన వ్యక్తి సుందరయ్య అన్నారు. జంధ్యాల రఘుబాబు మాట్లాడుతూ సుందరయ్య శతజయంతి ఉత్సవాలను ఆదోని, నంద్యాల డివిజన్ కేంద్రాలలో నిర్వహిస్తామని అన్నారు. అనంతరం నిర్వహించిన కవితా గోష్ఠిలో నంద్యాల, డోన్, కర్నూలు, ఆదోని ప్రాంతాలకు చెందిన కవులు సామాజిక అంశాలపై కవితలు చదివి వినిపించారు. ఈ కార్యక్రమంలో యుటిఎఫ్ నాయకులు ప్రతాప్, జయరాజ్, నాగరాజ్, రఫీ, సాహితీ స్రవంతి జిల్లా నాయకులు షఫీ, మహేష్, యు. ప్రేమ్‌కుమార్ పాల్గొన్నారు.

– కెంగార మోహన్

## విజయనగరంలో విద్యుత్ భారాలపై జనకవనం

మార్చి 31న గురజాడ స్వగృహంలో సాహితీ స్రవంతి పై అంశంపై సాహితీ స్రవంతి కన్వీనర్ చీకటి దివాకర్ అధ్యక్షతన విద్యుత్ కోతలు – వాతలు కవిగాయక సమ్మేళనం జరిగినది. ఇందుకు ముఖ్య అతిథిగా ప్రముఖ కథా, నవలా రచయిత దూరి. వెంకటరావు, హాజరయ్యారు. ఎస్.వి.ఆర్. కృష్ణారావు, సి.ఎస్.ఎస్. శ్రీనివాసరావు నిర్వహించారు. పై అంశంపై కృష్ణారావు ప్రసంగిస్తూ కొద్దిమంది సంపన్నుల కోసం పేదలపై విద్యుత్ భారం వేయడం అన్యాయమన్నారు. రాష్ట్రంలో నూటికి 70%గా వున్న పేదలు, మధ్య తరగతి, సామాన్యులు వాడే విద్యుత్ కేవలం 30% సంపన్నుల 20% మందే వున్నా వారు వాడే విద్యుత్ మాత్రం 70% వుందన్నారు. వీరు వాడుతున్న విలాస విద్యుత్ కోసం తక్కువ వినియోగిస్తున్న సామాన్యులపై భారం వేయడం సరికాదన్నారు. నేడు రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్న విద్యుత్ విధానాల ఇంధన సర్‌చార్జీల భారాల వలన అసెంబ్లీ నుండి గ్రామాల వరకు కరెంటు మంటలు రేగుతున్నాయి అన్నారు. నేడు ప్రతిపక్షంలో వున్నవారు, అధికార పక్షంలో వున్నవారు స్వర్ణాంధ్రప్రదేశ్, హరితాంధ్రప్రదేశ్ చేస్తామన్నారు. కానీ నేడు రాష్ట్రాన్ని అంధకార ఆంధ్రప్రదేశ్‌గా మార్చేశారు. వ్యవసాయ సంక్షోభం, పారిశ్రామిక మాంద్యం విద్యుత్ ఆధారిత కులవృత్తులు నేడు పనిలేక సంక్షోభంలో కూరుకుపోతున్నారు అని చెప్పారు. విద్యుత్‌ను ప్రైవేటీకరించడం ద్వారానే నేడు ఈ స్థితికి దిగజారినట్లు సంస్కరణలను పునః సమీక్షించాలని పేర్కొన్నారు.

ముఖ్య అతిథి మాట్లాడుతూ రాష్ట్రంలో కరెంటు వున్నా కరెంటు సమస్యను సుపక్షీయులు, విపక్షీయులు ప్రజలకు కోతలు లేకుండా భారాలు లేకుండా చూడాలన్నారు. ఈ సందర్భంగా మహాభాష్యం, మానాపురం, కనక లింగేశ్వరరావు, ప్రసాదు, రెడ్డి రామకృష్ణ, తమ తమ కవితలను, గేయాలను, చళ్ళపిల్ల శ్యామల గారు కథానిక చదివి వినిపించారు పలువురు కవులు, రచయితలు పాల్గొన్న ఈ కవిగాయక సమ్మేళనాన్ని పి.ఎస్. శ్రీనివాసరావు సాహితీ స్రవంతి నిర్వాహకులు సమన్వయం చేశారు.



హైదరాబాద్‌లోని మీర్‌పేట్‌లో ఎన్.బి.ఆర్. కాలనీలో ఏప్రిల్ 14న కళాతరంగిణి ఆధ్వర్యంలో జరిగిన కవి సమ్మేళనంలో సుంకేసుల రోశిరెడ్డి కవిశ్రీ కొరుప్రోలు మాధవరావు, ఆర్. వెంకట సుబ్బయ్య ఆచార్య కొలకలూరి ఇనాక్, కొండూరి కాశీ విశ్వేశ్వరరావు ఉన్నారు.

## ఖమ్మంలో ఉగాది కవి సమ్మేళనం



ఏప్రిల్ 13న ఖమ్మం సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో మంచికంటి భవన్‌లో సాదనాల వెంకటస్వామి నాయుడు అధ్యక్షతన ఉగాది కవి సమ్మేళనం జరిగింది. కందాడై శ్రీనివాసులు బోడేపూడి విజ్ఞానకేంద్ర డిప్యూటి జనరల్ మేనేజర్ తన కవిత 'అజ్యం పోద్దామనే' కవితతో సామాన్యుని కోపాగ్నికి కవితల ఆజ్యం పోదాం ఉద్యమాల ఉధృతిని ఉబ్బడి ముబ్బడి చేదాం పీడిత తాడిత ప్రజలకు 'విజయం' చేకూర్చుదాం!" అంటూ ప్రారంభం చేసారు. "ఎప్పుడు పడతి బతుకున కన్నీటి వెతలు మాయమౌనో నాడే యుగాది" అన్నారు టి. రాధ." నువ్వు పుట్టిన మట్టి, పెంచిన చెట్టు, పెరిగిన ప్రకృతి ఆఖరికి వూరు నీది కాదన్నారు" డా॥ గిరినరసింహారావు". అపజయాలు అనుభవమెట్లు చేసి, విజయ శిఖరాలు చేరాల్సిందే"' అంటూ ఆశించారు కొత్తా శంకరరెడ్డి. 'భానుడితో పాటు కలలుదయిస్తూనే వున్నాయి, గమ్యానికి ఆమడ దూరంలో అస్తమిస్తూనే వున్నాయ్" అన్నారు నవ వసంత వెలుగు అనే కవితలో జిల్లా నరేష్." విలపించకు కలం పాళీ - కంప్యూటర్ యుగంలో విన్ను చేస్తున్నారు ఎగతాళి" అని వాపోయారు హలవత్ సీత్లా. "సిక్స్ ఐటంస్ మిక్స్ డ్ జ్యూస్" అనే వ్యంగ్య హాస్య కవితతో అందరిని అలరించారు కవి, గాయకుడు కన్నెగంటి వెంకటయ్య. "రేపటి ఆశాకిరణంగా స్వాగతిద్దాం, సాదరంగా, విజయ నామ వసంతోదయానికి వినయంగా, వినమ్రంగా" అని తన నాంది అనే కవితలో సునంద. "వాడి ఆగమనానికి మంగీకార నగారా మోగింది, పచ్చని జీవన పచ్చికలో దుమ్ము సుడులు తిరుగుతోందని "హెచ్చరికలు చేసారు ఆధారం చేజారిపోతున్న క్షణాన అనే కవితలో పోతగాని సత్యనారాయణ, రక్త నగరం' అనే కవితలో" అల్లాఫో అక్బర్ అవాక్కయి, గుడి గంటలు గుండె బాదుకుని, చర్చిలో కుర్చీలు కొన్ని ప్రార్థనలు" చేస్తున్నాయని విస్తుపోయారు గరికిపాటి మణీందర్. "విద్యుత్ సంక్షోభం, అధిక ధరల పరుగుల "ప్రస్థావనతెస్తూ" నేనెందుకు కవిత రాయాలి' అనే కవితలో ప్రశ్నించారు. "ఈ కొత్త సంవత్సరంలో నైనా, కలసి మెలసి వుండాలి, కల్లోలాలు తగ్గాలి, స్వార్థం తగ్గి పరోపకారం పురోగమించాలనీ" శేషగిరి ఆశించారు. "మూలిగే నక్క మీద తాటి పండు!" అనే కవితలో "ఈ పండక్కైనా పిండాకూడు పెడతావా" అడుక్కునేవాడికీ లోకువయ్యాను! బతుకిట్టా తగలడిందేం" అంటూ ఆగ్రహం, వెలుబుచ్చారు కపిల రాంకుమార్. కె. ఆనందాచారి 'సూరీడా ఒరిగిపోకు' అనే కవితలో ఓ నా చదువు కోసం బడికెళ్ళే పిల్లలారా!, నీళ్ళు లేకుండానే పంటలు పండె పరిశోధన చేయండ్రా! కరెంటు లేకుండానే నడిచే ఫ్యాక్టరీలు కనిపెట్టండ్రా లేదంటే ఉత్తుత్తి వాగ్దానాలిచ్చే నాయకులుండే ప్రభుత్వాలు లేకుండా చేయండ్రా" అంటు తన కవితలో వేడుకున్నారు., సాదనాల వెంకటస్వామి నాయుడు, డా॥ మాధురి, రౌతు రవి, డా॥ కావూరి పాపయ్య శాస్త్రి, డా॥ పి.వి. సుబ్బారావు, తదితరులు కవితలు వినిపించారు. బోడేపూడి విజ్ఞాన కేంద్రం సభ్యులు వి.డి.ఎం.వి. ప్రసాద్ తన ఉద్యోగ ధర్మంలోని వ్యవహార పదాలతో చిన్న కవిత మొదటిసారి వినిపించి అందరిని ఆశ్చర్య చకితుల్ని చేశారు. లెనిన్ శ్రీనివాస్, తాళ్ళూరి లక్ష్మి, పలువురు కొత్త కవులతో చక్కటి సాహితీ వాతావరణం ఏర్పడిందని పలువురు అభిప్రాయబడ్డారు. రిటైర్డ్ ఉద్యోగులు, ఉపాధ్యాయులు, బి.వి.కె. విద్యార్థులు, స్థానిక ప్రజాసంఘాల నాయకులు, సాహితీ అభిమానులు పాల్గొన్నారు. ఈ మధ్య కాలంలో జరిగిన చక్కటి కవి సమ్మేళనం అని హాజరైన వారు ప్రశంసించటం గమనార్హం. బోడేపూడి విజ్ఞానకేంద్రం డిప్యూటి జనరల్ మేనేజర్ కందాడై శ్రీనివాసులు ఉగాది పచ్చడి, పులిహూర, చక్కెర పొంగలి, తేనీటితో అతిథ్యం అందచేసారు.

- కపిల రాంకుమార్

## గజపతినగరంలో ఉగాది కవి సమ్మేళనం

విజయనగరం జిల్లా గజపతినగరంలో గజపతినగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో స్థానిక గ్రంథాలయంలో ఏప్రిల్9న ఉగాది కవిసమ్మేళనం జరిగింది. ఈ సందర్భంగా చీకటి దివాకర్ మాట్లాడుతూ ఉగాది కొత్త సంవత్సరానికి నాంది పలుకుతున్నందున గడచిన సంవత్సరంలోని అంశాలు నెమరువేసుకుంటూ పొరపాట్లు జరగకుండా కొత్తసంవత్సరంలో జాగ్రత్తలు తీసుకోవాలన్నారు. ఆధునిక కాలానికి అనుగుణంగా సమాజాన్ని చైతన్యపరిచే రచనలు చేయాలన్నారు. కార్యక్రమాన్ని కొల్లూరు పద్మజ, పాయల మురళి, పి. రమణమూర్తి నిర్వహించారు. జిల్లాలోని పలు ప్రాంతాల నుంచి కవులు, గాయకులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## వందేళ్ళ పాలమూరు కథల సంకలనం కోసం కథలు పంపండి

పాలమూరు జిల్లానుంచి కథలు 1913 నుండి వెలవడడం జరిగిందని, నేటికి (2013) వంద సంవత్సరాల పూర్తి అయిన సందర్భంగా వందేళ్ళ పాలమూరు కథను తీసుకువస్తున్నట్లు డా. గుంటి గోపి ఒక ప్రకటనలో తెలిపారు. తమ దృష్టికి వచ్చిన కథలను సంపాదకుడు డా. గుంటి గోపి, ఇం.నెం. 33-153/1, పాన్‌గల్ రోడ్, వనపర్తి - 509103, మహబూబ్‌నగర్ జిల్లా చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు ఫోన్ నెం. 9492957381 ద్వారా సంప్రదించగలరు. ఈ మెయిల్ : **gunti.gopi@gmail.com**

# చైతన్య శక్తిగా పురోగమించాలి



**విజయనగరం** సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఏప్రిల్ 10న విజయనగరంలోని గురజాడ స్వగృహంలో ఉగాది కవిగాయక సమ్మేళనం జరిగింది. వయోభేదం లేకుండా యాభైకి పైగా కవులు, కవయిత్రులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. గోరుగుంట్ల రాజశేఖర్, రావాడ శ్యామల సంయుక్తంగా కవి సమ్మేళనాన్ని నిర్వహించారు. వసంతఋతువు ఆగమనంతో ఉగాది ఆవేశిస్తుందని, ప్రకృతి అంతా పచ్చదనంతో చిగురుతొడిగి కళకళలాడుతూ శోభిల్లుతుందని కవులు తమ కవితల ద్వారా విన్పించారు. కవి రెడ్డి రామకృష్ణ వినూత్న రీతిలో ఆధునిక పంచాంగం వినిపించారు. ఉగాది పచ్చడి షడ్రుచుల కలయికయితే, మానవ జీవితం సుఖదుఃఖాల కలయికని ఇదే ఉగాది పరమార్థమని ఆయన తన పంచాంగ శ్రవణం ప్రారంభించారు. వార్షిక వాతావరణం, వ్యవసాయం, ఆర్థిక వ్యవహారాలు నాటి శాస్త్ర విజ్ఞాన ప్రతీకలుగా చెపుతారని, నాటి కాలంలో మానవసమాజంపైన, ఉత్పత్తిపైన ప్రకృతిదే ప్రధాన ప్రభావమని తెలిపారు. నేడు మానవ విజ్ఞానం పెరిగిందని, ఉత్పత్తి సంపద పెరిగిందని తద్వారా రాజ్యాంగ వ్యవస్థ బలపడిందన్నారు. కాని పాలకుల విధానాలే నేటి విధి రాతలుగా అభివర్ణించారు. ప్రజలు ఆర్థిక మాంద్యంలో సర్వత్రా ఆందోళన చెందుతున్నారని, వ్యవసాయానికి సాయం లేక ఫ్యూచర్ ఫార్వర్డ్ ట్రేడింగ్‌తో క్రాపు హాలిడేలు వచ్చాయన్నారు. ఉద్యోగాలు మూరెడని, నిరుద్యోగాలు బారెడని, ఉప్పైనా, పప్పైనా మంటేనని, కూరలతోనూ గాయాలేనని అన్నారు. విద్య, వైద్యం అందనంత ఎత్తులో ఉన్నాయని, గాలి, నీరు, కరెంటు, రెంటు ప్రియమేనని, సర్కారీ పన్నులు గన్నులేనని, చిల్లర వ్యాపారానికి చిల్లులని, ఉద్యోగుల ఫించనుకు ఉరి, మబ్బుల చాటున మహిళా బిల్లు, మద్యానికి మంచి గిరాకీ తదితర అంశాలతో చదివిన ఆధునిక పంచాంగం శ్రోతలను ఆకట్టుకుంది.

ప్రపంచీకరణ సృష్టించే విధ్వంసం,, దాని వికృతరూపాన్ని, మనకు కాకుండాపోతున్న పల్లెలు, ప్రకృతి వనరులు, ఆర్థిక సంబంధాలుగా మారిపోతున్న మానవసంబంధాలు, కార్పొరేటీకరణ చెందుతున్న విద్య, వైద్యం, వ్యవసాయం, అగ్రదేశాల కబంధహస్తాల్లో



నలిగిపోతున్న తృతీయ ప్రపంచదేశాలు, ప్రజా నిరసనలు, ఉద్యోమాలు తదితర అంశాలతో కవులు చదివిన కవితలు సభలో ఉత్తేజం నింపాయి. ఈ కవి సమ్మేళనంలో రెడ్డి శంకర్రావు, చెళ్ళపిళ్ళ శ్యామల, ఇనుగంటి జానకి, ఇనుపకుర్తి సత్యనారాయణ, మానాపురం రాజాచంద్రశేఖర్, బాలసుధాకర్ మౌళి, పి.ఎస్. శ్రీనివాస్ తదితరులు కవితలు చదివారు. చంద్రిక పాడిన పాటలు అందరినీ అలరించాయి. ఆదిలక్ష్మి వందన సమర్పణతో కవిగాయక సమ్మేళనం ముగిసింది.



ఏప్రిల్ 11న సాయికృష్ణ ఎన్‌క్లేవ్ (బడంగ్ పేట)లో ఉగాది కవి సమ్మేళనంలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న తంగిరాల చక్రవర్తి వేదిక పై బడంగ్ పేట సర్పంచ్ కృష్ణారెడ్డి, గోపాలకృష్ణ, గజవెల్లి దశరథ రామయ్య, బాల్‌రాజ్ మాజీ.ఎం.పి.టి.సి, సినీ కవి మౌనశ్రీమల్లిక్



మల్లిపురం జగదీశ్‌కు సుబ్బరావమ్మ గోపాలస్వామి ఫౌండేషన్ కథా పురస్కారాన్ని అందిస్తున్న వ్యవస్థాపకులు పి. శ్రీనివాస్ గౌడ్. చిత్రంలో వడలి రాధాకృష్ణ, బి. హనుమారెడ్డి, డా. వి.ఆర్. రాసాని, నూకతోటి రవికుమార్, కె.వి. రమణారెడ్డి ఉన్నారు.

## రచయితలకు, పాఠకులకు విజ్ఞప్తి:

సాహిత్య ప్రస్థానంకు రచనలు, లేఖలను ఈమెయిల్‌లో పంపించేవారు ఇక నుండి తప్పనిసరిగా **ssprasthanam@gmail.com** మెయిల్లో మాత్రమే పంపించగలరు. పాత మెయిల్‌లో పంపించిన రచనలు పరిశీలించబడవు. దయచేసి గమనించగలరు.

# ఉగాది అంటే విప్లవం



ఏప్రిల్ 10న హైదరాబాద్ నగర సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జరిగిన ఉగాది జనవకనం. చిత్రంలో సుధామ, తంగిరాల చక్రవర్తి, అనంతోజు మోహనకృష్ణ, కపిల లక్ష్మణరావు ఉన్నారు.

ఉగాది అంటే విప్లవమని, మార్పునకు సంకేతమని కవి, విమర్శకుడు సుధామ అన్నారు. సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో ఏప్రిల్ 10న సుందరయ్య విజ్ఞానకేంద్రంలో చిట్యాల ఐలమ్మ హాలులో ఉగాది జనకవనం లో ముఖ్య అతిథిగా పాల్గొని సుధామ ప్రసంగించారు. గతం నుండి ఉగాది సందర్భాన్ని పురస్కరించుకుని సమ్మేళనాలు జరిగాయని, వీటిలో శ్రీశ్రీ, ఆరుద్ర, అనిశెట్టి తదితర కవులు, రచయితలు వీటిలో పాల్గొనేవారని ఆయన గుర్తుచేసుకున్నారు. నాటి కవుల రచనలను పరికిస్తే ఉగాదిలో చైతన్యస్ఫూర్తిని పట్టుకున్నారని అన్నారు. ప్రస్తుత పరిస్థితిలో కాలుష్యపు కోరల్లో ఆయుపరిణామాన్ని కుదించుకుంటున్నామని ఆవేదన వ్యక్తం చేశారు. వేపచెట్టు పేటెంట్‌తో భవిష్యత్ తరాలు గూగుల్ వెబ్‌సైట్‌లో చూసి తరించాల్సిన పరిస్థితి వచ్చిందన్నారు. ప్రకృతిని సంరక్షించే స్థితిలో మనం లేమన్నారు. 1966లో శ్రీశ్రీ రాసిన ఉగాది దేవరా అన్న కవితలో నేటి పరిస్థితులు సాక్షాత్కరిస్తున్నాయన్నారు. అందుకే కవి దిశానిర్దేశం చేయగలడన్నారు. నేటి ఉగాదిని పురస్కరించుకుని విద్యుత్, విధ్వంసం, అవినీతి, నీరు వంటి అంశాలను కవితా వస్తువులుగా చేసుకోవాలన్నారు. చివరగా ఉగాదిపై తాను రాసిన కవిత చదివి వినిపించారు. ఈ కార్యక్రమానికి సాహితీస్రవంతి నగర కమిటీ సంయుక్త కార్యదర్శి తంగిరాల చక్రవర్తి అధ్యక్షత వహించారు. ఎ. మోహనకృష్ణ నిర్వాహణలో జనకవనం జరిగింది. నేడు విద్యుత్ లేక వల్లెలు గొల్లుమంటున్నాయంటూ 'నవ వసంతం' కవితను కందుకూరి రాజ్యలక్ష్మి చదివారు. బాంబు పేలుళ్ళు అంశంపై ఎస్. విజయలక్ష్మి కవిత చదివారు. మౌనశ్రీ మల్లిక్ 'మట్టి, చెట్టు, మనిషి' అని చదివిన కవిత అందరినీ ఆకట్టుకుంది. రత్నామహీధర్, సాహిత్యప్రకాశ్, శాంతిశ్రీ, కర్లపాలెం భాస్కరరావు, జి. యాదగిరి రావు, సైదులు, నరసింహారావు, వెంకటి, సుతారపు వెంకటనారాయణ, జంకె కృష్ణారెడ్డి, ఆచార్య నరేంద్ర, కేతవరపు రాజ్యశ్రీ, కె. రాధాకృష్ణ, ఆలువాల సురేష్, కొండపల్లి నీహారిణి, శిష్టా మాధవి, చిత్తలూరి సత్యనారాయణ, కె. విల్సన్ రావు, డి. సైదులు, టి.వి భాస్కరాచార్య, మోపిదేవి రాధాకృష్ణ, ఆళహరి హనుమంతరావు, బొ.పా.రా, బిక్షపతి, (10టీవి) జి.ఎస్. రామకృష్ణ, హౌరప్రసాద్ తదితర కవులు 44 మంది తమ కవితలను వినిపించారు. గేరా వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

# వెలమల సిమ్మన్నకు సాహిత్య పురస్కారం



శ్రీమతి కుర్రా కోటిసూర్యమ్మ స్మారక సాహితీ అవార్డు ఫౌండేషన్ కమిటీ సాహితీ పురస్కారం 2013కు ప్రముఖ విమర్శకుడు ఆచార్య వెలమల సిమ్మన్నను ఎంపిక చేసినట్లు ఆ సంస్థ అధ్యక్షులు కుర్రా ప్రసాద్ ఒక ప్రకటనలో తెలిపారు. ప్రాచీన సాహిత్యం, ఆధునిక సాహిత్యం, వ్యాకరణం, భాషా చరిత్ర, భాషా శాస్త్రం, సాహిత్య విమర్శ వంటి పలు అంశాలలో రచనలు చేసిన సిమ్మన్న ఆంధ్ర విశ్వవిద్యాలయం దూరవిద్యలో తెలుగుశాఖ ఆచార్యులుగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ఈ అవార్డును శ్రీకృష్ణదేవరాయ సాహిత్యసాంస్కృతిక సేవాసమితి ఆధ్వర్యంలో ఒంగోలులో అందజేస్తున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు.



అనంతపురం జిల్లా హిందూపురం టీచర్స్ కాలనీలో మార్చి 24న సడ్లపల్లి చిదంబర రెడ్డి కవితా సంపుటి దృశ్యప్రవాహం, కథా సంపుటి కొల్లబోయిన పల్లె పుస్తకాల ఆవిష్కరణ సభ. చిత్రంలో డా. రాధేయ, డా. అద్దేపల్లి రామమోహనరావు, రామకృష్ణారెడ్డి, బండి నారాయణ స్వామి, నాయుని కృష్ణమూర్తి, డా. సి. పెద్దిరెడ్డి, రచయిత సడ్లపల్లి చిదంబర రెడ్డి, సింగమనేని నారాయణ, గుత్తి చంద్రశేఖర్ రెడ్డి, డా. రాజారాం ఉన్నారు.

# కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు విభాగ కార్యవర్గం ఎంపిక

కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు సలహా మండలి నూతన కార్యవర్గాన్ని ఇటీవల ఎంపిక చేసినట్లు మండలి సంచాలకులు, అధ్యక్షుడు డాక్టర్ ఎన్ గోపి తెలిపారు. తనతో పాటు ప్రముఖ సాహితీ వేత్తలు డాక్టర్ ఎస్వీ సత్యనారాయణ, డాక్టర్ సి. మృణాళిని అకాడమీ సర్వ సభ్య మండలి సభ్యులుగా నియమితులయ్యారన్నారు. శీలా వీర్రాజు, డాక్టర్ అమ్మంగి వేణుగోపాల్, ఓల్గా, డాక్టర్ ఎండ్లూరి సుధాకర్, వెలగా వెంకటప్పయ్య, దేవిప్రియ, రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి తదితరులు తెలుగు సలహా మండలి సభ్యులుగా ఎంపికయ్యారని పేర్కొన్నారు. వీరంతా అయిదేళ్ళ పాటు పదవిలో కొనసాగనున్నారు.

## డైరీ



# మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి 'ఆంధ్రా రచయితలు' పరిచయసభ

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో, ఏప్రిల్ 7న కాకినాడ, బ్రహ్మసమాజ మందిరంలో, మధునా పంతుల సత్యనారాయణ శాస్త్రి 'ఆంధ్ర రచయితలు' పునర్ముద్రిత గ్రంథం పరిచయసభ జరిగింది. సభకు అధ్యక్షత వహించిన ప్రసిద్ధ కవి, విమర్శకులు, డా. అద్దేపల్లి రామమోహన్‌రావు మాట్లాడుతూ, "ఆంధ్ర రచయితలు గ్రంథం, ఈ తరం వారికి అత్యంత ఉపయోగకరమనీ, 20వ శతాబ్ది ప్రథమార్థంలో అనేక ధోరణులకు మార్గ దర్శకులైన గొప్పకవుల, విమర్శకుల, గూర్చి విలువైన అంశాలపై అవగాహన కలిగిస్తుందని చెప్పారు. గురజాడ, చెళ్ళపిళ్ళ మొదలైన వారి నుండి ఆరుద్ర, దాశరథి, గుంటూరు శేషేంద్ర శర్మ వరకు, వారి వారి వ్యక్తిత్వ, రచనాతత్వాల్ని గూర్చి ముఖ్యమైన వివరాల్ని, 'ఆంధ్ర రచయితలు'లో మధునా పంతుల వారు అందించారనీ, చాలా ఆసక్తికరమైన సులభ గ్రాంథిక శైలి అనుసరించారనీ అన్నారు. సత్యనారాయణశాస్త్రి గారి తమ్ముని కుమారులు సత్యనారాయణమూర్తి, ఇతర కుటుంబ సభ్యులు ఈ గ్రంథాన్ని పునర్ముద్రించారు. సత్యనారాయణ మూర్తి ప్రధానవక్తగా పాల్గొని, సత్యనారాయణ శాస్త్రి జీవిత రచనా నేపథ్యాలకు గురించి రాస్తూ ఐ. పోలవరంలో జన్మించి, పల్లిపాలెంలో 'ఆంధ్రీ కుటీరం' స్థాపించి, 'ఆంధ్రి' పత్రికను రెండేళ్ళపాటు నడిపారనీ, ఆప్రతులన్నీ ఒక సంపుటంగా ముద్రించే ప్రయత్నంలో ఉన్నామనీ చెప్పారు. అద్దేపల్లి, పల్లిపాలెం వెళ్ళినప్పుడు, మధునాపంతులవారు 'ఇది అద్దేపల్లిపాలెం' అని చమత్కరించారని చెప్తూ, వారి హాస్యోక్తులు కొన్ని ఉటంకించి, సభ్యుల్ని అలరించారు. ప్రముఖ కథకులు గ.నా.రా, దాట్ల దేవదానం రాజు కూడా ప్రసంగించారు.



# అద్దేపల్లి 'పొగచూరిన ఆకాశం' కన్నడ అనువాదం ఆవిష్కరణ

శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞసమాఖ్య, తెలుగు సాంస్కృతిక సమితి, సంయుక్త ఆధ్వర్యంలో మార్చి10న బెంగుళూరులో రుస్తుమ్‌చౌక్సీ హాలులో డా. అద్దేపల్లి రామమోహనరావు 'పొగచూరిన ఆకాశం' కవితా సంపుటికి, ఆచార్య శ్రీమతి డా. అణ్ణమ్మ చేసిన కన్నడ అనువాద గ్రంథం 'హొగెముసుకిద ఆకాశ' ఆవిష్కరణ సభ జరిగింది. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన డా. తంగిరాల సుబ్బారావు మాట్లాడుతూ కవిత్వాన్ని సామాజిక చైతన్యంతో, సిద్ధాంత బలంతో రాస్తున్న కవి, విశ్లేషణాత్మక విమర్శకుడు అని అద్దేపల్లి రచనా పరిణామాన్ని వివరించారు. పుస్తకాన్ని ఆవిష్కరించిన డా. శాంతమ్మ మాట్లాడుతూ సామాజిక ప్రయోజనం గల కావ్యాల్లో ఉత్తమమైన 'పొగచూరిన ఆకాశం' కన్నడంలోకి అనువాదం కావడం చాలా ఆనందకరమని అన్నారు. అనువాదకురాలు బెంగుళూరు విశ్వవిద్యాలయ ఆచార్య శ్రీమతి డా. అణ్ణమ్మ కన్నడంలో ప్రసంగించారు. ఈ కవితాసంపుటి సమకాలీన ఆవేదనను గొప్ప భావచిత్రాలతో, కొత్త ప్రతీకలను ఆవిష్కరిస్తుందనీ, సాంస్కృతిక పతనంలోని ప్రతి అంశాన్నీ సూక్ష్మపరిశీలనతో రాసిన కవిత్వమనీ ప్రశంసించారు. డా. అంజనప్ప మాట్లాడుతూ 'అంబేద్కర్ మొదలుపెట్టిన వాక్యాన్ని పూర్తిచేద్దాం' అనే కవితను విశ్లేషించారు. 'మ్యూజ్‌ఇండియా' వెబ్‌పత్రిక సంపాదకురాలు శ్రీమతి అంబికా అనంత్ 'పొగచూరిన ఆకాశం' పుస్తకాన్ని ఆంగ్లంలోకి అనువదించిన రమణశాంతి 'ఐ నీడ్ ఎ లెటర్ అండ్ అదర్ పోయెమ్స్' పుస్తకాన్ని విశ్లేషించారు. కవి, ప్రయోక్త వి.యస్.ఆర్.యస్. సోమయాజులు మాట్లాడుతూ ఈ కవితాసంపుటి ప్రపంచీకరణ వల్ల కోల్పోతున్న దేశ అస్తిత్వాన్ని ప్రతిభావంతంగా నిరూపిస్తుందని అన్నారు. కవి యస్.ఆర్. పృథ్వీ మాట్లాడుతూ నిరంతర కవితాచైతన్యంతో, భావనిబద్ధతతో ముందుకు సాగుతున్న అసాధారణ కవి అద్దేపల్లి అన్నారు. అందువల్లనే& ఈ కవితాసంపుటికి ప్రతిష్ఠాత్మక అంతర్రాష్ట్ర పురస్కారమైన 'చిన్నప్పభారతి' అవార్డు లభించిందని తెలిపారు. కవి శ్రీకాలనాధభట్ల వెంకట్రామశాస్త్రి, అద్దేపల్లిపై రాసిన కవిత చదివి ప్రశంసలు అందుకున్నారు. చివరలో అద్దేపల్లి స్పందిస్తూ ఈ ఆవిష్కరణ సభ తనకు జరిగిన అపూర్వ సత్కారమని అన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
... Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

